# విషయసూచిక

# అభ్యుదయ

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ మాస పత్రిక

సంచిక 10, సంపుటి 2 | అక్టోబరు 1978 | సాలు చందా రు. 10


# జన గీతం

కె. పద్మారావు

ఏనాడు నేను కొనియాడలేను
రంభా రంభోరు సౌభాగ్య గరిమ
ఏనాడు నేను నుతియించలేను
పురావైభాగ్య కళాసౌభాగ్య మహిమ
ఏనాడు ప్రణయ కవితా మరీచికల
తూగలేను
శృంగార రస మదోన్మత్త
భ్రమరాన్నై తిరుగాడలేను
అందుకే
అనంగుని కేళీ విలాస వినోదముల
నేనాలాపింపలేను.
సత్యానికి దూరమైన ప్రతిదానిని
అలంకారంగా నేనంగీకరించలేను
ఆలోచన కందని ఆత్మని
అనుభవాని కందని అనుభూతిని
అర్థంలేని శబ్ద సౌందర్యంతో
మురిపించలేను.
అందుకే
నేను పాడాలి నిజంగా
క్షుద్బాధానల తప్తోదరాల ఉదంతాలు
నేను వ్రాయాలి నిజంగా
భావదాస్య శృంఖలాబద్ధ
ప్రజావిముక్తి సూక్తాలు
నేను పాడాలి నిజంగా
కడుపు కూటికి కాయాన్ని
రక్కసులకు బలియిచ్చే
భరత వనితా జనతా
బాధా తరంగాలు
నేను కూయాలి నిజంగా
కన్నబిడ్డలకు దోసెడు
గంజి పోయలేక
స్వహస్తాలతో విషదగ్ధులను చేసిన
తల్లి అంతరాంతరాల్లో రగిలే
సెగల మూలుగులు
నేను వ్రాయాలి నిజంగా
వరకట్న పీడితయై
అత్తమామల రాపిడులు
త్రాగుబోతు భర్త తాడనలు
భరించలేక ఉరి వేసుకొన్న
ఇల్లాలి హృదయోద్రేకాలు
అదుగో
ఎండి పోయిన తల్లిగుండెపై
పండి పాలుగుంజే బిడ్డడు
చుక్కరాక దప్పి దీరక
గుద్దుతున్నాడా గుండెనే
ఏమిటీ అన్యాయమని.

అవిగో
క్షయగ్రస్తుడైన భర్త
కలుషిత రక్తపు కళ్ళెలతో
భూమి తడిసి పోతుంటే
అమ్మడానికి పుస్తెలేని
అభాగ్యురాలి
దీనార్తనాదాలు.
అవిగో
పులిస్తర్ల కుండీల మూగిన
మన సోదర భారతీయుల
దీన రూపాలు
ఈ దేశ భాగ్యోన్నతికి నిదర్శనాలు
ఓహో నా దేశం
ఆధ్యాత్మిక చింతనాంధకార
పూరితం
నిర్జీవ నిప్రాణ నీరవోన్మాద సహితం
దీన హీనోద్విగ్న హృదంతర
ప్రభంజన సహితం
అందుకే
చైతన్య శంఖం పూరించాలి
సమ సమాజ నిర్మాణచణులై
గమించాలి
గుండె లోతుల నుండి భావం
చీల్చుకు రావాలి
వ్యథార్త హృదయాల కోసం
కలం పరుగులు తీయాలి
జనగీతం
జననాదం
జన సాహితీ సృజనం
ప్రజా కవుల ధ్యేయం.

# సంస్కరణ . . . (మైక్రో కథ) జి. నరసింహ మూర్తి

అప్పటికే కొడుకులకూ, కూతుళ్లకూ యివ్వాల్సింది యిచ్చేశాడు ముందు చూపున్న కోటేశ్వర్రావు.

పెళ్లంతో తనకు విడాకులు కావాలంటూ కోర్టెక్కాడు.

'కొడుకులూ, కోడళ్ళూ, మనవలూ, మనవరాళ్ళూ ఉన్న మనుషులు కదా, ఎందుకొచ్చిన విడాకులు? ఉన్న నాలుగు రోజులూ రగ్గులో దూరి వెచ్చగా మొగుడూ పెళ్ళాలు తొంగోక', అనుకున్నారు కొందరు.

'పోవే వెధవముండా' అని మొగుడంటే 'పోరా వెధవా' అని పెళ్లం అనేసింది లాయర్ల ముందు.

అంతా కిన్నీరై పోయారు. లాయర్లకి తమ లా పుస్తకాల్లో ఉన్న రూల్సు కన్నా వీళ్ల దెబ్బలాట మంచి యెఫెక్టు నిచ్చింది.

పెళ్లానికి, ఉన్నదాంట్లో నలభై యెకరాల గండేరా యిచ్చేయాలంది కోర్టు.

'భూమి పోయినా పర్వాలేదు. ఈ పెళ్లం పోవాలి' అన్నాడు కోటేశ్వరావు మీసం మెలేస్తూ.

విడాకులూ, రాతలూ కోతలూ అయిపోయిన తర్వాత స్వయంవరంలో నెగ్గిన రాకుమారుడిలా పెళ్లాన్ని తిన్నగా యింటికి తీసుకు తెచ్చుకున్నాడు.

.. అంతా ముక్కు మీద వేలేసుకున్నారు గుడ్లు తేలేసి.

ఆ దెబ్బతో భూ సంస్కరణల పీడ వదిలిందని మొగుడూ పెళ్లాలు కొత్త దంపతుల్లా కులకడం ప్రారంభించారు.

# ఆంధ్ర విమర్శనా ప్రపంచంలో సాటిలేని

# రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ

ఆపాత మధురం, ఆలోచనామృతం అయిన సంగీత సాహిత్యాలను అరిగించుకొని, ఆధునికాంధ్ర సాహిత్య ప్రపంచానికి అమూల్యమైన రచనలను అందించిన అపురూపమైన వ్యక్తి – శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ. సాంప్రదాయికమైన వాతావరణంలో పెరిగినా, ప్రాచీనులలో నవీనులుగా, నవీనులలో నవ్యులుగా సాక్షాత్కరించే సహృదయ శిరోమణి శ్రీమాన్ రాళ్లపల్లి. వ్యక్తిలోని సుప్రసన్నత - సంస్కారం అభివ్యక్తిలో అడుగడునా అవతరిస్తుంది; అందరినీ మురిపిస్తుంది. ఆంధ్ర విమర్శనా ప్రపంచంలో అనంతకృష్ణులు కాలగతి దృష్ట్యా ద్వితీయులైనా, గుణరీతి దృష్ట్యా అద్వితీయులు.

అనంతకృష్ణ శర్మగారు క్రి. శ. 1893 జనవరి 23 వ తేదీన అనంతపురం జిల్లా, కల్యాణదుర్గం తాలూకాలోని రాళ్లపల్లి గ్రామంలో జన్మించారు. తల్లి అలమేలు మంగమ్మ, తండ్రి కర్నమడకల కృష్ణమాచార్యులు. శర్మగారు తండ్రి వద్ద సంస్కృతాంధ్ర సాహిత్యాలు అభ్యసించారు. తర్వాత పైచదువు నిమిత్తమై మైసూరుకు ప్రయాణం (1912). పరకాల మఠాధిపతులైన శ్రీ కృష్ణ బ్రహ్మతంత్ర పరకాల యతీశ్వరుల వద్ద, ప్రకాండ పండితులైన శ్రీ చామరాజనగరం రామాశాస్త్రిగారి వద్ద సంస్కృత కావ్యాలలోని సౌందర్యపు లోతులు తెలుసుకొన్నారు. మైసూరులోనే శ్రీచందనం వంటి శర్మగారికి, అగ్నిపర్వతం వంటి మేధావి కట్టమంచి రామలింగా రెడ్డిగారితో పరిచయం కల్గింది. రెడ్డిగారి ఔదార్యం వలన శర్మగారు మైసూరు మహారాజా కాలేజిలో తొలి తెలుగు పండితులుగా నియమింపబడ్డారు. 1912 నుండి ముప్పైఏనిమిదేళ్లపాటు ఆ పండిత పదవిని రాళ్ళపల్లి వారు కీర్తిశ్రీ శోభితం చేశారు.

అనంతకృష్ణ శర్మగారు నూనూగు మీసాల నూత్న యౌవనంలో 'తారాదేవి', 'మీరాబాయి' అనే రెండు ఖండకావ్యాలను సంప్రదాయబద్ధంగా వ్రాశారు. వీరు ప్రాకృతం నుండి ఆంధ్రీకరించిన 'గాథాసప్తశతీసారం', సంస్కృతం నుండి ఆంధ్రీకరించిన 'ఆర్య' ప్రశస్తమైన అనువాద రచనలు. భావసౌకుమార్యం, భాషాలాలిత్యం – సారళ్యం వీరి అనువాద ప్రత్యేకతలు. జాయప సేనాని విరచిత 'నృత్తరత్నావళి' తెలిగింపు కూడ శర్మగారి అనువాద కౌశాలానికి మచ్చుతునక.

శర్మగారు పెర్ ఫెక్షనిస్టు. మానస సాగరమును మధించి మధించి అమృత తుల్యమైన రచనలను మనకు అందించినారు. వీరి రచనలు సర్వాంగీణ శోభితములై, పనితనా నికిపరమావధియై వెలువడినవి. పని తనము కొర

**ఘట్టమరాజు అశ్వత్థనారాయణ**

వడితే శర్మగారు ఆ రచనలను వెలుగు చూడ నివ్వలేదు. వారి కలము నుండి జాలువారిన పద్యమే కాదు, గద్యము కూడ హృద్యముగా శోభిల్లినది.

రాళ్ళపల్లి వారు గొప్ప వ్యాసకర్తలు. సాహిత్య వ్యాసానికి సౌందర్యాన్ని ప్రసాదించిన రసఋషి. 'రాయలనాటి రసికత', 'నిగమశర్మ అక్క', 'తిక్కన్న తీర్చిన సీతమ్మ' — ఈ మూడు వ్యాసాలు వీరి వ్యాస రచనా చాతుర్యానికి నిదర్శనాలు. ఈ వ్యాస రచనలో, శర్మగారు విషయ నిర్ణయములో ప్రదర్శించిన నేర్పు, అదిమధ్యాంతములను రమణీయముగా తీర్చి దిద్దుటలోని ఓర్పు, సుందర సుమధుర సార్థక పదముల కూర్పు — అన్యత్ర దుర్లభము. 'రాయలనాటి రసికత' కడపట శర్మగారు చేసిన తీర్మానము: "కావున నెన్ని దోషము లున్నను రసికత్వము తిరస్కరింపదగినది కాదు. అది నాగరికతకు నిధానము; పౌరుషమునకు ఫలము; అభ్యుదయమున కాధారము." ఈ వాక్యము వ్యాసపు నిగ్గు తేల్చింది. 'నిగమశర్మ అక్క' వ్యాసము చివర శర్మగారు వ్రాసిన ఒక్క వాక్యము — "పరిహాసము పవిత్ర వస్తువును గూడ గమనింపదేమో!" రామ కృష్ణుని పాత్ర చిత్రణలో నేర్పు ఉన్నా, ఓర్పు తక్కువ అని సూచిస్తుంది. మౌలికమైన ఆలోచన, మనోహరమైన శైలి, సంక్షిప్తత వీరి వ్యాస రచనలోని ప్రత్యేకతలు. వీటికి తోడుగా సుకుమారమైన హాస్యము, సున్నితమైన వ్యంగ్యము.

శర్మగారి 'నాటకోపన్యాసములు' విషయ విశ్లేషణ - విశదీకరణకు చక్కని ఉదాహరణ. వీరి 'వేమన' తెలుగు విమర్శలో మేరుకృతి. అలంకార శాస్త్రమును ఆధారముగా నుంచుకొనక కావ్యము తమను ఏ విధంగా ప్రభా వితము చేసినదో - ఆ రీతిని శర్మగారు 'వేమన'లో నిరూపించినారు. విమర్శను శర్మగారు ఎన్నడు శాస్త్రముగా పరిగణించ లేదు. వారి దృష్టిలో అది ఒక కళ. ఒక కవిని గాని కావ్యమును గాని పరిశీలించుటలో శర్మ గారు అనుసరించిన విధానమును వారి మాటలలోనే విందాము: ... "గ్రంథకర్త యొక్క ఆశలు, అభి మానములు, రాగద్వేషములు మొదలగు జీవన సూత్రములను గమనించి, వాని యావిష్కరణ పద్ధతులు అందుచే మన హృదయమందు గలుగు సంవాద వివాదములను బైలుపరచుట మూడవది." ఈ తత్త్వమును అనుసరించి శర్మగారు తమ విమర్శనాత్మక వ్యాసములను వ్రాశారు.

అనంతకృష్ణ శర్మ గారు వ్రాసిన పీఠికలు కూడ వారి విమర్శనా పాటవమును ప్రదర్శించును. కవి అంతరంగ పరిశీలన చేసి నిర్భయంగా తమ అభిప్రాయములు చెప్పుటలో శర్మ గారు అందె వేసిన చెయ్యి.

'సంగీత కళానిధి'యైన శర్మ గారు తాళ్లపాక వారి సంకీర్తనములను పరిష్కరించి, వాటి సొగసులు ఎత్తిచూపి, కొన్నింటికి స్వరప్రస్తారములు కల్పించిన రీతి అనన్య సామాన్యము. శర్మగారి సంగీత వైదుష్యము, సాహిత్య రాసిక్యము సార్థకమై ఈ కార్యమందు రూపు తాల్చాయి.

సంగీత సాహిత్య మర్మజ్ఞులైన అనంత కృష్ణ శర్మగారు తమ రచన లలోను - జీవితములోను శుద్ధాంతరంగులై శోభిల్లుచున్న కమనీయమూర్తి.

# 'నయాగరా'

## తెలుగు అభ్యుదయ, విప్లవ సాహిత్యంలో జంఝానిల వీచిక

1944 మార్చిలో మొదటి సారి అచ్చయి, అభ్యుదయ కవితా యుగంలో ప్రామాణిక గ్రంథంగా పరిగణించ వలసిన 'నయాగరా'కు మూడు దశాబ్దాలు గడిచినాక గాని, రెండో ముద్రణ భాగ్యం కలగలేదు.

ఆ రోజుల్లో అభ్యుదయ సాహిత్యోద్యమంతో ఏమాత్రం సంబంధం వున్న వారికైనా 'నయాగరా' అభిమాన పాత్రమైన కవితా సంకలనం. ఇతరులు 'నయాగరా' ను చదివి కోపం తెచ్చుకున్నారు, మరి కొందరు దిగ్భ్రాంతి చెందారు. మొత్తం మీద అందర్లోనూ సంచలనం కలిగించిందిది.

కాని 'నయాగరా' కొత్త తరానికి తెరమరుగై పోయింది. తొలి ముద్రణలో వేసినవి కొద్ది వందల ప్రతులు. ఇప్పుడవి దొరకడం దుర్లభ మయింది. రెండో ముద్రణ చేద్దామన్న శ్రద్ధ ఎవరికీ లేక పోయింది. ఇప్పుడు సాహిత్యంలో సాము గరిడీలు చేస్తున్న అనేకులు దీని పేరు వింటే వినవచ్చునేమో కాని, చూసినవారు బహు అరుదు.

ఇంత కాలం గడిచి పోయినా, మళ్ళీ 'నయాగారా' అందుబాటులోకి రావడం— అది మంచి కవిత్వం అయినందు వల్లనే కాదు, దానికి చారిత్ర ప్రాముఖ్యం వుండడం వల్ల కూడా — హర్షించ వలసిన సంగతి.

అప్పటికి పాతికేళ్ల ప్రాయం వారైన ముగ్గురు - బెల్లంకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం 'నయగరా' కవులు. స్వస్థలం నరసారావు పేటలోను, గుంటూరులోనూ తప్పితే వీరికి నామ రూపాలు లేవు. ఒక్కొక్కరివీ మూడేసి గీతాలు చొప్పున వున్న యీ తొమ్మిది గీతాల చిన్న పుస్తకం వెలువడడంతో, వీరు తెలుగు దేశమంతటా అభ్యుదయ సాహిత్య రంగంలో ప్రసిద్ధు లయ్యారు. ఈ సంకలనం ప్రామాణిక గ్రంథంగా పేరు పడింది.

ద్వితీయ ముద్రణకు 'మళ్ళీ ఇన్నాళ్లకు!' అన్న శీర్షికతో పీఠిక రాస్తూ, యీ ముగ్గురిలో ఒకరైన కుందుర్తి అంజనేయులు 'నయాగరా'ను "చారిత్రక ప్రాధాన్యం కల ఒక కావ్యం" అన్నారు. అవినయమని పిస్తుందేమో కాని, అది నిజం మాత్రం అవును.

ఈ పుస్తకానికి శీర్షికలో "అభ్యుదయ కవితా యుగంలో అచ్చయిన తొలి కావ్యం" గా చెప్ప బడింది. అందు వల్ల మాత్రమే 'నయాగరా'ను గొప్ప పుస్తకంగా ఒప్పుకోనక్కర్లేదు. శ్రీ శ్రీ 'మహాప్రస్థానం', నారాయణ బాబు 'రుధిర జ్యోతి', పుస్తకాలుగా రాలేదప్పటికి. కాని శిష్ట్లా 'నవమి చిలుక', 'విష్ణు ధనువు' పుస్తకాలుగా వచ్చినట్టున్నాయి. ఆచార్య రంగా సంపాదకత్వాన వచ్చిన 'రైతు భజనావళి', 'నయా

గరా'కు కొన్ని సంవత్సరాలు ముందుగా వెలువడింది. 'రైతు భజనావళి' లోని గీతాలను, పాటలనూ నాజూకు కవిత్వంగా లెక్కగట్టరేమో కాని, అవి నూటికి నూరు పాళ్లు అభ్యుదయ కవిత్వమే.

'నయాగరా' తొలి ముద్రణ సరికి శ్రీ శ్రీ గీతాల హోరు తెలుగు దేశంలో అనేక సంవత్సరాలుగా వినిపిస్తునేవుంది. (అభ్యుదయ కవిత్వానికి గురజాడ వేసిన ప్రాతిపదిక వుండనే వుంది). అభ్యుదయ కవులుగా పరిగణింప బడిన శిష్ట్లా, నారాయణ బాబు పత్రికల్లో కనపిస్తున్నారు. రైతు భజనావళి పాటలు, గీతాలు అతివాదుల పత్రికల్లో వస్తుండేవి. అవి అతివాదుల సభలలోనూ, ఊరేగింపులలోనూ శ్రోతలలను ఉత్తేజపర్చేవి. ఇదీ 'నయాగరా' వెలుగులోకి రావడానికి ముందరి పూర్వరంగం.

ఇదే కాదు. 1943 ప్రారంభంలో తెనాలిలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభ, ఆ సంఘం ప్రచురించిన అభ్యుదయ రచనల సంపుటులు అభ్యుదయ సాహిత్యానికి దోహదకారులుగా వుండేవి.

ప్రళయ భయంకరంగా జరుగుతూ వుండిన రెండో ప్రపంచ యుద్ధం; కరువు కాటకాలు; నానాటికీ తీవ్రతరమవుతోన్న స్వాతంత్రోద్యమం; సోవియట్ సేనల పరాక్రమం, విజయాలు; యూరప్‌లో, ఆసియాలో విముక్తి సమరాలు యువకులను ఉత్తేజపర్చి, వారిని అతివాద భావ ప్రేరితులుగా చేసినట్లుగానే, యీ 'నయాగరా' కవులనూ ప్రభావితులను చేశాయి. అంతవరకూ తెలిసీ తెలియక అరాచక ధోరణులతో కవిత్వం రాస్తోన్న వీరిని కీ. శే. పులుపుల శివయ్య ఆచార్యత్వం సరైన పట్టాల మీద పెట్టింది. ఈ పరిస్థితుల్ని 'నయాగరా' గీతాలు స్పష్టంగా ప్రతిబింబిస్తాయి, ప్రతిధ్వనిస్తాయి.

ఈ పుస్తకానికి పేరు ఎందుకు పెట్టారో కాని, నయాగరా జలపాతం దూకుడు వీటిలో సర్వత్రా వినిపిస్తుంది. “నిప్పుల కంఠం” అన్న పదబంధం యీ కవులకు చాలా యిష్టం - వీరి గీతాల్లో మహోద్రేకం వినిపిస్తుంది; వీటిలో వాళ్ళెరగని ఆవేశం ధ్వనించని చోట్లు చాలా తక్కువ. ఈ గీతాల్లో, శ్రీ శ్రీ గీతాల్లో లాగానే రాజకీయాంశ, విప్లవాంశ అధికం. అయితే, శ్రీ శ్రీ గీతాలు విప్లవాకాశంలో విహరించినవయితే, 'నయగరా' కవులు దివినుండి భువికి దిగివచ్చి, భారత దేశంలోనూ, తెలుగు గడ్డ మీదా తిరుగులాడారు.

తన “నిప్పుల కంఠం పలికిన విప్లవ గీతం” ('నా గీతం')లో బెల్లంకొండ రామదాసు “కదలని సమాజ హిమాలయంలో కదిలే నవక్రాంతి మండించిం” దంటాడు. అది “స్వేచ్ఛా మహాగ్ని పర్వత శిఖరాంచల రక్త జ్వాలికగా మండిం” దనీ; “సామ్రాట్టులు దాచిన నెత్తురు నాలుకలే నరికిం” దనీ, “హిట్లర్లకు, చాణుక్యులకూ గోరీ కట్టి” దనీ, “కాలపు దారుల్లో చీకటి ముళ్లను తొలగించిం” దనీ, “వెన్నెల పువ్వులు చల్లింద” నీ చెప్తాడు అది “శ్రామిక జన ఫాలంలో ఎండని ఘర్మ జలం చల్లని చేతులతో తుడిచి” ంది. “వర్గ రహిత సంఘ స్వర్గానికి పూల నిచ్చెనలు వేసి” ంది. “నరహంతకుల చెరసాలలకు నిరంకుశ నియంతలకు తల కొరువులు పెట్టి” ంది. “నవలోకం చూపిం” ంది.

రామదాసు 'ఈ రోజున' అన్న తన గీతంలో (అంటే రెండో ప్రపంచ యుద్ధం సాగుతోన్న రచనా కాలంలో) "చరిత్రలో తిరిగిన మరణపు తిరగట్లో బియ్యపు గింజల్లా నలిగి నలిగి మండిన గుండెల్లో కండలు ఎర్రని జెండాలై" నాయని చెప్పి —

"జగత్తు
ఒక సోల్జరు అడుగై
కదనానికి
కదిలిందీ రోజున!" —

అంటూ యుద్ధ చిత్రాన్ని గీసి, ఆ దృశ్యాలను వర్ణించి, సర్వమూ ప్రజా హితం కోసమే జరుగుతూ వున్నదని హామీ యిస్తూ, వారికోసమే మాస్కో నిలిచిందనీ, వారికోసమే బెర్లిన్ కూలిందనీ ప్రకటిస్తాడు. "మీ కళ్యాణానికి రణ ధనుస్సువిరిగిం" దంటాడు.

ఇంకో గీతంలో ('చెరసాల') ప్రపంచంలోని దీనుల్ని సంబోధిస్తూ, దూర దృష్టితో జరగ బోయే దానిని వివరిస్తాడు:

"మీకై
ఈ నాడొక
అగ్ని పర్వతం
పగులు తోంది చూచారా !

మీకై
ఈ నాడొక
అరుణ పతాకం
ఎగురుతోంది చూచారా !

మీకై
ఈనాడొక
నవ జగత్తు
ప్రభావిస్తున్నది చూచారా!"

ఈ ఆశాభావాన్నే కుందుర్తి ఆంజనేయులు 'జయిస్తుంది' అన్న తన గీతంలో "ప్రజా విజయ రథసారథి... శరవేగంతో నడిచే విప్లవ సైన్యం జయిస్తుంది" అని వ్యక్తం చేశాడు. "క్షీరాంబుధి" లాంటి, "జగద్దుఃఖ శమనానికి కదిలిన కరిగిన కరుణా రస మహానదం" లాంటి, "కదలిన కనక రథంలా వదలిన బ్రహ్మాస్త్రంలా ఫెళ ఫెళ నడిచే విప్లవ సైన్యం జయిస్తుంది" అని ఎలుగెత్తి చాటుతాడు. ఈ విప్లవ సైన్యం కోరిన దానినీ, చూసిన దానినీ కవి యిలా చెపుతాడు:

"సిరిలో
పొర్లాడిన
శ్రీమంతులకూ
ఆకలితో
మొకరిల్లి
అసువులు విడిచిన
దిక్కులేని
దీనులకూ
చోటులేని లోకాన్నే
విప్లవ సైన్యం కోరింది

గత కాలపు మతాలకూ
శ్రుతి కలవని కులాలకు
తర తరాలు పీడించిన
పరిపాలన పద్ధతికీ
వీలు లేని లోకాన్నే
విప్లవ సైన్యం చూసింది."

అంజనేయులు మిగతా రెండు గీతాలు ఒకటి భారత దేశానికి ('తరవాత'), యింకొకటి ఆంధ్ర రాష్ట్రానికి ('మన్యంలో') సంబంధించినవి.

"నిలువలేవు నీ ముందు
నీ కనుచూపుల బాకుల ముందు
దేశభక్తి ద్రోహమనీ
దోపిడి పరిపాలన మనీ

నిరూపించు
కురూపి శాసనాలు !

ప్రాణ త్యాగంలో
రక్తంలో
బలిలో
కర శృంఖలలో
నవోదయం నాట్యమాడి
పెట్టుబళ్ల ప్రభుత్వాలకు
వర్తక సామ్రాజ్యాలకు
వినాశ హేతుక
విప్లవ శంఖం
వినపడ్డది
కనపడ్డది
కార్మిక లోకం
శిరమెత్తిన రక్త పతాకం!''

'మన్యంలో' అన్న గీతంలో అల్లూరి సీతారామరాజు బ్రిటిష్ ప్రభుత్వం మీద చేసిన తిరుగుబాటును, కవి ''ప్రభుత్వం విరగబాటును అణిచేసిన గొడ్డలిపెట్టు'' గాను, ''రాచరికపు బాటల్లో రాజుకున్న కారు చిచ్చు'' గాను చెబుతాడు.

''మా చేసిన
మన్య విప్లవం దేశానికి
మార్గదర్శి
దిగివచ్చిన వెలుగు బాట
సెంటు జార్జి
కోట చెవుల్ చెదిరించిన
విప్లవ దుందుభి''

మన్య విప్లవం ''మా చరిత్రలో వీచిన ఝంఝూనిల వీచిక!'' అంతే కాదు-అది ''విదలించిన వీరుని ఖడ్గం, పగపట్టిన పాము బుసా, చూపించిన విప్లవ మార్గం, సామ్రాజ్యపు కత్తుల వానకు పట్టించిన స్వర్ణచ్ఛత్రం, అధికారపు అన్యాయమ్ములు అడ్డించిన రక్షా కవచం!''

సంపుటంలోని మూడో కవి పిల్లుట్ల సుబ్రహ్మణ్యం మూడు గీతాలలో, ''ప్రజా శక్తి'' నయగరా జలపాతంలా హోరెత్తిస్తుంది.

''సకల ప్రజా సముద్ధర్త
సుప్తోద్ధృత జీవశక్తి
మహాశక్తి ప్రజాశక్తి
వస్తున్నది వస్తున్నది!

రూక్షోజ్వల రుధిర దీప్తి
క్ష్మానాధుల తలలు తరిగి
కండ కరుగు కూలీలకూ
రక్త మోడు రైతులకూ
వస్తున్నది ప్రజాశక్తి!''

ఈ ప్రజాశక్తి ''గగనంలో వేగు చుక్క జగమంతా జగచ్ఛక్తి తమస గర్భ దళనహేతి దానిసత్వ విచ్ఛేదక ప్రబల విజయ మహాశక్తి''. అది ఆకటితో అలమటించు జీవులకు ''అన్నపూర్ణ స్వర్ణ పాత్ర'',

'విజయ ముద్ర' అన్నార్తుల తిరుగుబాటును, విజయాన్ని స్పష్టాస్పష్ట చిత్రాలలో చూపే గీతం. వీరు ''విను వీధిలో వికార ప్రేత జీవాలు కారు మేఘాల బారు'' వంటి వారు; ''ఆకలో ఆకలో యని గోడు గోడుగ రోదించి డొక్క లెండి కనిగుడ్లు పీక్కు పోయి కణికెడు కూటికి ఘూర్లిల్లి'' న ''ముష్టి మూక''. ఈ మూకకు, మెరుపుతో పోల్చబడిన దోపిడీ వర్గానికి జరిగిన పెనుగులాట మిగతా గీతంలో వర్ణింప బడింది. చివరికి ''పడగ చితికిన పాము లాగున పైకి దూకి బిచ్చగాళ్లు ఒక్కటై'' కేక పెట్టి మెరుపును మింగేస్తారు. పర్యవసానంగా ''పేద జీవుల విజయ ముద్రగ ఎగురుతున్నది ఎర్ర జెండా!''

ఆకలితో అలమటించే బిచ్చగాళ్లో పేదవాళ్లో ప్రాణం విసుగెత్తి తిరుగుబాటు చెయ్యడమూ తమ పీడకులను హతమార్చడమూ జరిగితే జరగవచ్చును. కాని అది విప్లవమూ కాదు, దోపిడీ వ్యవస్థను నిర్మూలించి స్థిరమైన శ్రామిక రాజ్య వ్యవస్థ స్థాపనకు నాందీ కాదు. ఈ గీతంలోని అవగాహన సరి అయినవి కాదు కాని, అది దోపిడీ వ్యవస్థ నిర్మూలనాన్ని, శ్రమ జీవుల రాజ్యస్థాపనను కాంక్షిస్తున్నది.

పఠాన్ సత్యాగ్రహుల పైని తుపాకీ గుళ్లు కాల్చడానికి అంగీకరించక బ్రిటిష్ పాలకులకు ఎదురు తిరిగి, శిక్షకు గురి అయిన సైనిక దళ నాయకుడు "అఖండ భరతావని ఆరక వెలిగే మణిదీపం" ఠాకూర్ చంద్ర సింగ్, "సామ్రాజ్యపు చెలియలి కట్టను ఛేదించిన రక్త తరంగం!" "పొగలు చిమ్మె తుపాకి గుండ్లకు ప్రతిఘటించు బానిస గుండెల మెరసిన ఆదర్శ ద్యుతి చంద్ర సింగ్ విప్లవ దీక్ష!" "300 ల ఏండ్లక్రితం నాటుకున్న విషవృక్షం చీకట్లను చిమ్ముతుంటె విరిసిన చంద్రుడు చంద్రసింగ్!"

శ్రీ శ్రీ గీతాలు ఫెళ ఫెళార్భటులతో మారు మోగుతున్న కాలంలో, అవి యింకో గొంతును వినబడ నివ్వని కాలంలో 'నయాగరా' కవులు తమ "నిప్పుల కం"ఠాన్ని నగరా మోతలా వినిపించారు. ఇది సామాన్యమైన సంగతి కాదు. వీరి స్పష్టమైన విశిష్టత యిది. లోకంలోని దురన్యాయాల పట్ల యీ కవుల తీవ్రమైన అసహనం, రౌద్రం పట్ట పగ్గాలు లేనివిగా కనిపిస్తాయి. ఆ రౌద్రం ఎంతటి దంటే – తమ నిష్కపటమైన ఆవేశాన్ని కొన్ని కొన్ని చోట కవిత్వ భాషలోనికి అనువదించుకునే నిగ్రహం కోల్పోయేటట్టు చేసిందది. "వీరులకే బీర్ బాటిల్!" వంటి ప్రయోగాలతో హుందాతనం కోల్పోయేటట్టు చేసింది. అలాగనే అన్వార్థమైన "ముష్టి మూక" "విజయ ముద్రగ ఎగురుతున్నది ఎర్రజండా!" వంటి అసాధ్యపు ఊహా విమానాలూ వున్నాయి, 'నయగారాలో'.

అయితే యివేవీ 'నయాగరా' చారిత్రక ప్రాధాన్యాన్ని తగ్గించవు. ఇది తెలుగు అభ్యుదయ, విప్లవ సాహిత్య చరిత్రలో "వీచిన ఝంఝూనిల వీచిక!"

. . . విమర్శనము విమర్శకుని చిత్తవృత్తి ననుసరించి యుండుననుట స్పష్టము. అయినను గుణము గుణముగాను దోషము దోషముగాను వర్ణించుట యుత్తమ పద్ధతి యనియు, గుణము మాత్రము ప్రకటించి దోషము గప్పిపుచ్చుట మధ్యమ పద్ధతి యనియు, దోషము మాత్రము విశదీకరించి గుణము మఱుగు పఱుచుట యధమ పద్ధతి యనియు, గుణమును దోషముగానో దోషమును గుణముగానో వెల్లడించుట యధమాధమ పద్ధతి యనియు లోకజ్ఞులు చెప్పుదురు. . .

. . . విమర్శకుడు కొంత కాలమునకు బూర్వాభిప్రాయము మార్చు కొన వచ్చును గాని, ఆ మార్పు సప్రమాణ మైనపుడే యుచిత మగును గాని యస్థిర చిత్తముతో నసూయతో గావించిన దైనచో విద్వల్లోకము సమ్మతి గాంచ జాలదు. కావున నేదేని యొక విషయమును విమర్శించుటకు ముందుగా నర్హత సంపాదింప వలెను.

మల్లాది సూర్యనారాయణ శాస్త్రి

# చీమలు పెట్టిన పుట్టలు

**కథానిక**

**వై. వి. ఎస్. ఎస్. ఎన్. మూర్తి**

గూడెం అంతా తేట్టుడికి పోయి నట్టు ఉడికిపోతోంది. ఎవరింట్లోనూ పొయ్యి రాజియ్య లేదు. ఎవరికీ కాళ్ళు నిలవడం లేదు. "ఏం చేయడం? ఏం చేయడం?" అంటున్నారే గాని, ఏం చేయడమో ఎవరికీ తోచడం లేదు. తాత తండ్రుల కాలం నుండి ఉంటున్న చోటు, ఎన్నాళ్ళో శ్రమపడి ఎన్నో కష్టాలు పడి కట్టుకున్న కొంపల్ని అర్థంతరంగా వదిలి పెట్టి ఎక్కడికి పోవడమో ఎవరికీ అంతు బట్టలేదు. కుర్రాళ్ళు మాత్రం ఉద్రేకపడిపోతున్నారు. "మమ్మల్ని ఖాళీ చేయించడానికి ఎవడొస్తాడో చూస్తాం! ఈవాళ వాళ్ళ తలలో, మా తలలో ఎగిరిపోవాలి" అంటున్నారు వాళ్ళు.

పట్నానికి ఒక మైలు దూరంలో వెలివేయబడ్డట్టున్న గూడెం ప్రజలకి అకస్మాత్తుగా ఆ స్థలం ఖాళీ చేసి పొమ్మని నోటీసు జారీచేసింది ప్రభుత్వం. ఎందుకంటే ఆ స్థలం ఒక ఫ్యాక్టరీ నిర్మాణం కోసం ఎవరో ఒక గొప్ప వ్యక్తికి దాఖలు పరచబడ్డదట. 15 రోజుల్లో స్థలం ఖాళీ చేయకపోతే, ఇళ్ళన్నీ పీకేస్తామన్న వార్నింగు కూడా ఆ నోటీసు ద్వారా వచ్చింది. నోటీసు వచ్చినప్పటి నుండి ఎవరికీ కాళ్ళాడ్డం లేదు. ఏదో పెద్ద ఆపద వచ్చి నెత్తిమీద పడినట్లు ఉక్కిరి బిక్కిరి అయి పోతున్నారు. నిజం చెప్పవలసి వస్తే, వాళ్ళు ఆ స్థలం ఎందుకు ఖాళీ చేయాలో వాళ్ళకే తెలీదు. "ఎవరో ఫేక్టరీ కట్టుకుంటే మమ్మల్ని ఇళ్ళు ఖాళీ చేయమనడం ఏం న్యాయం?" అన్నది వాళ్ళ ప్రశ్న. ఎప్పటి నుండో అక్కడే కొంప గూడూ కట్టుకొని పిల్లా-పిచ్చికతో బ్రతుకుతున్నారు వాళ్ళు. ఈ వాళ అది మీది కాదు పొండి అంటే ఎక్కడికి పోవాలా అన్నదే బెంగ వాళ్ళకు. అదే దిగులు. ఈ సమస్య గుప్పిటిలో నుండి ఎలా బయట పడ్డమా అని తల బద్దలు కొట్టుకుంటున్నారు.

"ఎందుకొరే! యిలా మనం తల బాదుకోడం? మన సత్తింగారి దగ్గిరకు పోయి సెప్పుకుందాం. ఆయన గోరే ఏదో దారి సూపిత్తాడు" అన్నాడు ముసలయ్య. ముసలయ్య పేరుకే కాదు వయస్సులో కూడ గూడెంలో అందరి కంటే పెద్దే.

కాని కుర్రకారుకా మాటేం నచ్చలేదు. "సత్తింగార్ని నమ్ముకొంటే కొంప నట్టేట్లో కట్టుకోడమే!" అన్నాడు ముసలయ్య మనుమడు చిన్న ముసలయ్య. "మొన్నటికి మొన్న మన కూలి బత్తెం కోసం చేసిన సమ్మెలో రైతులకే వంత పాడాడు గాదా! ఈనారి మాత్రం మనకేం వొరగ బెడతాడు?" అన్నాడు ముత్యాలు ఆవేశంగా.

"ఆయన మాత్రం ఏం జేత్తాడు, మనలో మనకే కట్టులేక పోయె" అన్నాడు ముసలయ్య.

"ఒరే తాత! నువ్వలా అంటువుండు!

మన బతుకులు ఇలా రోజు రోజుకూ దిగజారడమే గాని యెదగవు. అళ్ళు సెఱుకు, గింజలు నాయంగా అమ్మి నాభాలు గడిస్తున్నారేటి ? ఈ పెద్దోళ్ళంతా ఇంతే. అళ్ళకి ఈ పెబుత్వం కాపలా! అళ్ళకి నచ్చనోళ్ళు ఎదుట ఉండకూడదు. ఈయేళ మీరీ సోటులో ఉండగోడదు; రేపు మీరీ భూమి మీదే మనుష్యుల్లా బతక్కూడదు అని నోటీసిత్తారు. మన సత్తింలాటోళ్ళు ఓటు యేసే దాక మన మాట, ఆపైన పైవోళ్ళ పాట. అళ్ళను నమ్ముకోడం కంటే కొంపలికి అగ్గి పెట్టుకొని అందులో పడి సచ్చిపోడం మంచిది'' అన్నాడుచిన్న ముసలయ్య ఆవేశంగా.

''ఒరేయ్ ముసిలిగా! వూరికే ఆవేశపడిపోతే యేటి లాభం ? ముందు జరగాల్సిన కతేటో సూడండి!'' అన్నాడు చిన్నయ్య.

''ఏటి సేయ గలం! ముసలయ్య తాత సెప్పినట్టు సత్తిం గారికి సెప్పి, ఆ పైన ఆయనేటి సెయ్యమంటే అదే సేద్దాం'' అన్నారు తలలు నెరిసిన పెద్దలంతా.

''సరే!'' అంటూ లేచారు అందరూ.

* * *

''బావూ! ఇప్పటికి ముప్పయేళ్ళ క్రితం మా గూడెం సరిగ్గా మన సెఱుకు పేటరీ వుండే అక్కడుండేది. ఆనాడు ఆ బావు లంతా వచ్చి అక్కడ సెఱుకు పేటరీ కట్టిత్తాం. మీకు సాలు పొడువునా కూలి పని వుంటుంది. ఈ తలం పేటరీకి మంచిది. ఏటి పక్కనే పేటరీ ఉండడం మంచిది. మీరు ప్రతీ యేడు వరదలవల్ల ఇబ్బంది పడుతున్నారు. మా మాట యిని మీరు వూరికి దక్షిణాన తమ్మల సెరువు కాడ ఇళ్ళు కట్టుకొండి. ఆ తలం అంతా మీకే వుసితంగా యిత్తాం. ఆ తలం పైన హక్కు మీకే ఉంటుంది. ఇళ్ళు యేసుకోడానికి తలొక వందా ఇత్తాం!'' అని సెప్పినారు. పని మీద ఆశ చేత ఇళ్ళన్నీ కాళీ చేసి అళ్ళకి ఇచ్చేసినాం. ఊరికి దూరంగా తుమ్మల సెరువు కాడకు పోయినాం. అక్కడ ఎక్కడ చూసినా తుమ్మ మొద్దులూ – గాతలూ – నీరు – రాళ్ళు రప్పలే. పురుగు – పుట్ర సెప్ప పని లేదు. మాలో కొంత మంది పురుగూ – పుట్రకు బలియిపోనారు. గాతలన్నీ పూడ్చి, సక్కగా సదును చేసి ఇళ్ళు కట్టుకున్నాం. ఆళ్ళిచ్చిన వందే మూల ? నా నా కష్టాలు పడి సెమట అంతా కార్చి ఇళ్ళు యేసుకున్నాం. ఆళ్ళన్నట్టుగానే పేటరీ పెట్టినారు. మాలో కొంత మందికి పనిచ్చినారు. ఏదో గుడ్డిలో మెల్ల అనుకున్నాం. కొందరం పేటరీ పనిలోకి పోయేవాళ్ళం కొందరం రైతువారీ పని లోనికి పోయేవాళ్ళం. నాలు గైదేళ్ళు పోనాయి. ఎవరో పట్నం బాబులు వచ్చినారు. సంఘం అన్నారు. సమ్మె లన్నారు. కూలీ పెంచమని సమ్మె సేయించినారు. పేటరీ మూత పడ్డది. పేటరీలో పనిచేసేవోళ్ళు వీధిలో పడ్డారు. పనీ – పాట లేదు. గంజికి ముఖం వాసి పోనారు. అల్లాడి దేశాల పాలయి పోనారు కొందరు. కొన్నాళ్ళు పోయాక లారీల నిండా మనుష్యులు దిగారు పొన్నూరి నుండి. పేటరీ తలుపులు తీసినారు. కాని పనులు మాకియ్య లేదు. ఏం అని అడిగినోడు లేడు మాతరపున. సమ్మె చేయించిన పట్నం బాబులు రాలేదు.

అయినా ఎలాగో మా బతుకులు మాం బతుకుతూ వస్తున్నాం. ఆ నాడు గవర్నమెంటోడు మాకిచ్చిన తలాన్ని మానుండి లాక్కొని మమ్మల్ని మల్లా దేశాల పాలు సేయాలని సూత్తున్నారీ పెద్దోళ్ళు. బాపూ! నాయం నువ్వే సెప్పు? మమ్మల్ని నువ్వే కాపాడాల. నువ్వేటి సెయ్యమంటే అదే సేత్తాం" అన్నాడు ముసలయ్య.

అంతా జాగ్రత్తగా విన్న యం. ఎల్. ఏ. సత్యం "ముసలయ్యా! ఆనాడు ప్రభుత్వం మీ పేర స్థలం కేటాయించినట్లు వ్రాసి యిచ్చిన పత్రాలు ఏమయినా ఉన్నాయా" అన్నాడు.

"అలాటియ్యి యేటి లేవు!" అన్నాడు ముసలయ్య.

"అయితే చాలాకష్టమే!" అన్నాడు సత్యం.

"బాబ్బాబూ! నువ్వే కాపాడాల."

"ఎన్నికల్లో మా ఓట్లన్నీ మీకే వేసినాం. మా బాగోగులన్నీ మీరే సూడాల" అన్నాడు చిన్నముసలయ్య.

"కాదని నేను అన్నానా! అలాగే చూస్తాను. హైదరాబాదు వెళ్ళి ముఖ్యమంత్రి గారితో మాట్లాడి వ్యవహారం సెటిల్ చేసుకువస్తాను. కాని హైదరాబాదు పోయి వచ్చేందుకు ఖర్చులు అవుతాయి కదా!" అన్నాడు సత్యం.

"బాబూ! కరుసులు కోసం జంకం. ఏపాటి కరుసు అవుతాదో సెప్పండి, తెచ్చి ఇత్తాం!" అన్నాడు ముసలయ్య

"సుమారు 200 అవుతాయి."

"సరే బాబూ! తెచ్చి ఇత్తాం!" అన్నారు అంతా.

గూడెం ఇళ్ళ వాళ్ళందరూ చందాలు పోగుచేసి రెండొందలు సత్యం చేతికి ఇచ్చారు. సత్యం అవేళే హైదరాబాద్ వెళ్ళిపోయాడు.

సత్యం హైదరాబాదు వెళ్ళి 12 రోజుల అయింది. అటునుండి జాడ - జవాబు లేదు. గూడెం ప్రజలంతా సత్యం రాకకోసం ఆశగా ఎదురుచూస్తున్నారు.

ఒక రోజు తెల్లవారు ఝామున లారీల నిండా మనుషులు దిగారు. బుల్‌డోజర్లు దిగాయి. తెల్లవారే టప్పటికి గూడెం మట్టిలో కల్సిపోయింది. వాళ్ళ సామానులు చిందర వందరగా, చెల్లా - చెదురుగా పడి రోడ్డుపాలయిపోయాయి.

పిల్లా మేక, పెద్దా - చిన్నా, ముసలీ ముతకా అందరూ కట్టుగుడ్డలతో మిగిలిపోయారు. చిందర వందరగా పడివున్న సామాన్లు మూటగట్టుకొని, నెత్తిమీద పెట్టుకొని మరొక చోట గూడు కట్టుకోను బయలు దేరారు గుంపులు గుంపులుగా. మమత చావని ముసలి వాళ్ళు కూలిపోయి మట్టిలో కలిసిన ఇళ్ళ చుట్టూ కన్నీళ్ళు పెట్టుకొని పిచ్చిగా తిరుగు తున్నారు.

ఇంతలో దుమ్ము లేపుకుంటూ పట్నం వైపు రయ్యన వస్తున్న కారు వైపు పిల్లలు వింతగా చూస్తున్నారు. కొత్త ఎంబాసిడర్ కారు దుమ్ము రేపుకుంటూ వాళ్ళ మధ్యనుండి దూసుకు పోయింది. గాలితోపాటు పైకి లేచిన దుమ్ము వాళ్ళ ముఖాలపై కోటా కొట్టినట్లు పడింది.

కారులో యం. ఎల్. ఏ. సత్యం కాళ్లు నిగడదన్ని, సిగరెట్టు దమ్ము లాగుతూ, చూసీ చూడనట్టు చూస్తుండం ఎవరూ చూడలేదు.

# రచయిత్రికి విజ్ఞప్తి

**సొదుం రామ్మోహన్**

ఇటీవల ఒక కథ చదివాను. ఆ కథ పేరు 'పిన్ని'. అది రాసిన రచయిత్రి పేరు పెళ్లకూరు జయప్రద.

అది చదువుతోంటే కనీసం రెండు సార్లు గుండెలు పిండినట్లు ఫీలయ్యాను. ఈ కథలో సెంటిమెంట్ తప్ప మరేం విశేషంలేని మాట కూడా వాస్తవమే. అయితే ఆ సెంటిమెంట్‌నైనా గుండెలు పిండేలా చిత్రించడం అనుకున్నంత తేలికేమీ కాదు. పైగా పిన్ని పాత్ర చిత్రీకరణ కూడా చాలా బాగుంది.

ఇక్కడ పాఠకుల కొక సందేహం రావచ్చు — కేవలం 'సెంటిమెంట్' ప్రధానంగా గల కథను ఇంతగా ఆకాశాని కెత్తడం ఎందుకు అని.

నిజమే, అభ్యుదయ రచయితలు కానీ, అభ్యుదయ సాహిత్యాన్ని యిష్ట పడే పాఠకులు కానీ సెంటిమెంటల్ జాడ్యానికి అతి ప్రాముఖ్యం ఇవ్వరు. అయితే కళకు గీటురాయి ఏది అన్న ప్పుడు, హృదయమే అని సమాధానం ఇవ్వక తప్పదు. అంటే మిగతా ఎన్ని గుణాలున్నా, గుండెను కరిగించని కళ కళ కాదు (కళ అంటే కథలకు, కవిత్వాలకు అన్నిటికీ వర్తిస్తుంది).

ఈ కథలో 'పిన్ని' కి తన అక్క కొడుకు పట్ల గల మమకారాన్ని గొప్పగా చిత్రించారు రచయిత్రి. 'పిన్ని' అక్క కొడుకును సొంత కొడుకు కంటే ఎక్కువ ప్రేమిస్తుంది. అలాగే ఆ అబ్బాయి కూడా పిన్నిని సొంత తల్లి కంటే ఎక్కువ ప్రేమిస్తాడు.

అయితే ఈ పరస్పర అనురాగాలను వివరణ (Narration) లో కాక, దాన్ని action లో చూపడమే గొప్పతనం. కథ చదివినంత సేపూ ఒక నాటకాన్ని రంగం మీద చూస్తున్నట్లు పాఠకుడు అనుభూతి చెందుతాడు.

పాఠకులకు మరో సందేహం కూడా రావచ్చు. హృదయాన్ని కదలించే ప్రతి కథనూ, కవిత్వాన్ని, అందులోని ఇతివృత్తంతో ప్రమేయం లేకుండా, ప్రశంసించడమేనా? ఇతివృత్తం అభి వృద్ధి నిరోధకమైంది అయితే, ప్రశం సించకపోవడం అటుంచి, గర్హించాల్సిందే కానీ తల్లీ బిడ్డల మమకార మాధుర్యం అభివృద్ధి నిరోధక మైందని నేననుకోను. అభ్యుదయ రచయిత గానో, విప్లవ రచయిత గానో ముద్ర వేసుకున్న రచయిత అలాటి కథ రాస్తే, అయ్యో నీకింత కంటే మంచి ఇతివృత్తం దొరక లేదా అని అడగొచ్చు. నాకు తెలిసినంత వరకు యీ రచయిత్రికి అలాటి ముద్ర లున్నట్లు దాఖలాలు లేవు.

ఒక మిడిల్‌క్లాస్ ఫిలాసఫీకి చెందిన రచయిత ఏవో ఊహాత్మక సమస్య లను సృష్టించి, వాటికి కథా రూపం ఇవ్వడానికి తంటాలు పడకుండా ఈ మాత్రం కథ రాయడమైనా హర్షిం చాల్సిన విషయమే అనుకుంటా. అయితే ఈ రచయిత్రికి నాది ఒక్కటే విజ్ఞప్తి:

ఇలాటి యితివృత్తాలకు బదులుగా, సామాజిక సమస్యలను కాన్వాస్‌గా తీసు కుని, ఇలా గుండెలు పిండేలా రాస్తే మీ కలానికి ఎదురుండదు. అశేష పాఠక జనం మీకు బ్రహ్మరథం పడుతుంది.

**కథానిక** ఇంగ్లీషు

# పరిణామం

## జాన్ గాల్స్వర్దీ

జాన్ గాల్స్వర్దీ (1867 – 1933) సుప్రసిద్ధుడైన అంగ్ల రచయిత. పెట్టుబడి దారీ విధానం చిన్న చిన్న వృత్తులు చేసుకొనే వారిని, హస్త కళా నిపుణుల్ని, రైతుల్ని సర్వ నాశం చేసి చరిత్రలో పెంట కుప్పల మీద ఎలా పారేసిందో ఆయన కథలూ, నవలలూ వివరిస్తాయి.

ఆయన వ్రాసిన కథలలో "ఇవల్యూషన్" అన్న దానిని ఇక్కడ ఇస్తున్నాము.

నాటక శాలలోంచి బయట పడి చూసే సరికి టాక్సీ దొరకడం అసంభవం అనిపించింది. కొద్దిగా చినుకు పడుతున్నా, వీధి చివరకంటా నడిచేము. జట్కాలు, గుర్రబ్బగ్గీలూ ఎన్నో వెళ్లిపోతున్నాయి. కాని, ఇంకా కొన్ని మిగిలిపోయి వున్నాయి. అయితే టాక్సీల నిండా జనమే. ఇంకా విసుగేసి పిక డెల్లీ సర్కస్ దగ్గర ఓ గుర్రబ్బగ్గీని బేరమాడుకున్నాం.

ఎంతో దూరం వుంది మా ఇల్లు. ప్రయాణమూ బహు నెమ్మదిగా సాగిందేమో, ఇల్లు చేరేసరికి సగం కునుకు తీశాం. బండి కిరాయి రెండు షిల్లింగులు. ఇస్తున్న నాణెం సరిగ్గా అర క్రౌనో కాదో అని వీధి దీపం క్రింద నిలబడి జాగ్రతగా చూసుకున్నాం. బండి వాని చేతిలో పడేసే ముందు తలెత్తి చూసేం, ఎందుకో. బండి వాడు ఓ అరవై యేళ్లవాడులా కనిపించేడు. దొక్కు పోయిన కోల మొహం, మీసాలు నెరిసేయి. బుగ్గలు బాగా సొట్టలు పడి వున్నాయేమో, ముఖం ఎముకలు మూట కట్టి నట్లుంది. మాటా మంతీ, కదలికా, మెదలిక లేకుండా తల వంచుకుని గుర్రం తోకమీదే దృష్టి పెట్టి కూర్చును న్నాడు. అనుకోకుండానే అర్ధ క్రౌన్ తోపాటు వున్న చిల్లర కూడా అతని చేతిలో పోశాం. అతనూ మాట్లాడకుండా తీసుకున్నాడు. కాని, తోట గేటు తెరుస్తూంటే – "బతికించేరు. థేంక్యూ" అన్న మాట వినిపించింది.

ఆ మాటకి ఏ మనాలో తోచక, గేటు మూసి మళ్లీ వెనక్కి వచ్చేం.

"అంత కష్టంగా వుందా?"

"ఆ. ఇంకీ పని లాభం లేదు. మా అవసరం ఎవరికీ లేదు."

బండివాడు కొరడా చేతిలోకి తీసుకుని, తిరిగిపోయే సన్నాహంలో వున్నాడు. ఉన్నట్టుండి మాకేసి తిరిగి మళ్లీ మొదలెట్టేడు.

"ముప్ఫయ్యయిదేళ్లుగా బండి తోలుతున్నా. టాక్సీన్ని నిందించను... ఎవర్నీ లాభం లేదు. మా దురదృష్టం. అంతే. ఈ వేళ పొద్దుటే ఒక్క పెన్నీ చేతికివ్వకుండా పెళ్లాన్ని ఇంట వదిలి వచ్చా. నిన్ననే అంది –"ఈ నాలుగు నెలల నుంచి నువ్వు ఇంటికేం తెచ్చేవ"ంది. "వారానికి ఏడు షిల్లింగుల దాకా తెస్తున్నా కాదటే" – అన్నా. "ఏమీ కాదు. అరే తెచ్చేవు..."

"తిండి కూడా గడవడం లేదా?"

బండివాడు చిరునవ్వు నవ్వేడు. సన్నని, ఆ కోల ముఖం మీద ఆ చిరునవ్వు ఎల్లాగో అనిపించింది.

"మీకు అల్లాగే అనిపించొచ్చు. మీరు రాక ముందు ఈ వేళటి సంపాదన మొత్తం ఒకటిన్నర షిల్లింగులు. నిన్న అయిదు షిల్లింగులు. బగ్గీకి అద్దె

ఏ రోజు కారోజే ఇచ్చెయ్యాలి.''

మాలో ఎవరో జనం ప్రయాణాలు మానేసినట్లున్నారు.

బండి వాడు తల తిప్పుకొని చీకట్లోకి చూసేడు.

"జనం'' అతని గొంతులో ఆశ్చర్యం వినిపించింది. "ప్రయాణాలు చెయ్యకేం. అందరికీ టాక్సీలే కావాలి. అది సహజం. టాక్సీ బహు వేగంగా తీసుకుపోతుంది. కాలం చాలా విలువ గలది. మీరు రాక పూర్వం 7 గంటలుగా నేనక్కడే నిలబడి వున్నా. మీరూ టాక్సీ కోసమే చూస్తున్నారు. మోటారు పేరు చెప్తే భయపడే ముసలమ్మలు చాల మందే వున్నారను కోండి. కాని, వాళ్ల చేతల్లోంచి డబ్బు పెగలదు.''

"మీ పరిస్థితికి ఎంతో విచారిస్తున్నాం ... ''

మాట మధ్యలోనే అతడు "విచారంతో రొట్టె కొనలేము'' – అంటూ తల అటూ, ఇటూ తిప్పేడు.

"అంతే కాదు. జనం మాత్రం ఏం చేస్తారు? ఒకళ్లమా, ఇద్దరమా?''

మేము గుర్రం వేపు వెళ్ళాం. ఆ చీకట్లో కూడ దాని ఎముకలు లెక్కకు వీలుగా కనిపిస్తున్నాయి. బండి అతడు మళ్లీ చబుకు తీసుకున్నాడు. నిర్లిప్తంగా అన్నాడు:

"నేను మరో పని చూసుకోలేను. ఇంక మరో దారి లేకపోతే శరణాలయమే గతి.''

"అన్యాయమే'' అన్నాం. అతడు చిరునవ్వు నవ్వేడు.

"నిజమే. ఆ దశ పట్టడానికి మేం చేసిందేం లేదు. అన్నీ అల్లా తోసుకొచ్చేసేయి. నాకు తెలిసినంత వరకు పరిస్థితులు అల్లానే వున్నాయి. కూర్చుని ఈ వేళంతా ఆలోచించా. మా పని అయిపోయింది. ఇంకెన్నో రోజులుండదు. మా రోజు లెళ్లిపోయేయి. ... నే నెవరి మీదా నెపం వేయడం లేదు. అడిగేరు గనక చెప్పా.''

చబుకు తీసుకోవడం మూడో మాటు, అయితే ఈ మారు "థేంక్యూ'' అంటూ గుర్రాన్ని అదిలించేడు. నిద్రలోంచి మేలు కున్నట్లు పాపం ఆ బక్క జంతువు అడుగేసింది. చెట్ల నీడల్లోంచి రోడ్డు మీద నెమ్మదిగా బండి సాగింది. బండి కనుమరుగైనా, నెమ్మదిగా దొర్లుతున్న చక్రాల గర గర గాలి వాలున సన్నగా వినబడుతూనేవుంది.

## లోకువ ...?!

పి. ఎస్. రామచంద్రరావు

బస్సోడికి – లారీ వోడు లోకువ!
లారీ వోడికి – వేనోడు లోకువ!
వేనోడుకి – చిన్నకారోడు లోకువ!
చిన్న కారోడుకి – ఆటోరిషా
వోడు లోకువ!
ఆటోరిషావోడుకి – స్కూటరోడు లోకువ!
స్కూటరోడుకి – మూడు సక్రాల రిషా
వోడు లోకువ!
మూడు సక్రాల రిషావోడుకి – సైకిలోడు
లోకువ!
సైకి లోడుకి? – ఓసి ఆపాటి తెల్దా
మీకు?
రోడ్డు మీద నడిసే ఓడు లోకువ!!

# రెండు మంచి నవలలు

'శ్రీవిరించి'

'నవల' అనే పేరులోనే కొత్తదనం సంతరించుకు వున్నది. ఈ ప్రక్రియ మనకు పాశ్చాత్య ప్రభావం వల్ల వచ్చిన సరికొత్త సంవిధానం. 'నవల'కు నూరు సంవత్సరాలు నిండాయని 1972 లోనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఉత్సవాలు జరిపారు. శరపరంపరగా అనేక వ్యాసాలు వచ్చాయి ఆ రోజులలో. 'మొదటి నవల యేది?' అంటే అందుకు మూడు రకాల సమాధానాలు సిద్ధంగా వున్నాయి. అయినా 1872 లోనే ఈ సంవిధానానికి బీజం పడిందని నిర్ధారణ అయింది.

నవల హ్రస్వ రూపంలో 'నవలిక' అనిపించు కుంటోంది. నవలలు, నవలికలు అనేకం ప్రచురణ అవుతున్నాయి యీ రోజులలో. 'రాశి'లో ఎక్కువే అయిన 'వాసి'లో తక్కువగా వుంటున్నాయని చాలా మంది విజ్ఞుల అభిప్రాయం.

మంచి రచనలకు లోపం యేమీ లేదనీ, కాకపోతే యెన్నిక చేసుకొనడంలోనే కొంత జాప్యం యేర్పడుతోందని అనిపిస్తుంది. రచనను సాంఘిక ప్రయోజనం కోసం వాడుకొని తద్వారా సమాజంలోని వ్యక్తులకు యేదయినా సందేశం యివ్వడం మంచి లక్షణం. ఇటువంటి రచనలను ప్రగతిశీల.మయినవిగా భావిస్తాము.

విధవా వివాహాలు, స్త్రీల వివాహ సమస్య వంటివి సమాజాన్ని అనేక సంవత్సరాలుగా పీడిస్తున్నాయి. విధవా వివాహాలను ఒక ఉద్యమం లాగా నడిపిన కందుకూరి వీరేశలింగం వంటి వారికి నివాళులు అర్పించడం కేవలం వార్షిక సాంప్రదాయంగానే మిగిలిపోయింది గాని, యీ రకమయిన సంస్కరణ సమాజ జీవనంలో ఓతప్రోతంగా కలసిపోలేదు ఇంకా. పోతే స్త్రీల వివాహ సమస్య (వివాహ సమస్య వారికే ప్రత్యేకంఅనీ-పురుషులది కాదనీ కాదు ఉద్దేశ్యం. కాకపోతే ఇది కేవలం ఆడువారికి సంబంధించిన విషయంగానే ఒక దురభిప్రాయం మనలో పాతుకుపోయింది. ఎంత దులపరించుకు పోదామనుకున్నా సాధ్యం కాపోవడం లేదు) రకరకాల రూపాంతరాలు పొందింది, చిలువలు పలవలుగా శాఖోప శాఖలుగా విస్తరించింది. ఈ విషయాలను వస్తువుగా తీసుకొని నవలలు వ్రాసిన వారు – యిటీవలి సంవత్సరాలలో బహు కొద్ది. వచ్చిన నవలలోనూ యేదో రకమయిన కొత్తదనం వున్నవి యింకా కొద్ది. ఈ పద్ధతిని పరిశీలించినప్పుడు శ్రీ వి. రాజా రామమోహన రావు వ్రాసిన నవలలు (నవలికలు) రెండు కాస్తంత విశిష్టంగా కనిపిస్తాయి. ఇవి 'కొత్త చిగురు', 'పరాయి నీడ' అనేవి. 1975, 77 సంవత్సరాలలో ప్రచురితం అయినాయి (నవభారత్ – ఎమెస్కో ప్రచురణ సంస్థల ద్వారా). 'కొత్త చిగురు' అన్న నవలలో ప్రధానమయిన

పాత్ర 'రాణి' అనే యిరవై నాలుగు సంవత్సరాల అమ్మాయి. అందమూ ఆరోగ్యమూ పుణికి పుచ్చుకున్న అభాగ్యురాలయిన వితంతువు. చిన్న వయసులోనే యీమె జీవితంలో యేర్పడిన విపర్యయాన్ని సరిచేయడం కోసం అన్న, వదిన ప్రయత్నం చేస్తారు. వారి కుటుంబ స్నేహితుడు 'వేణు' అనే అతను శారీరక సంబంధాని కయితే సరేనంటాడు, కాని వివాహానికి ససేమిరా అంటాడు. అతని అక్క లక్ష్మి యెంత సహకరించి చెప్పబూనుకున్నా వేణు మనసు మారదు. ప్రసాద్ అనే అతను మరో కుటుంబ మిత్రుడు. ఇతను కొత్తగా భార్య పోయిన వాడు. అంటే 'రాణి' వున్న మానసిక స్థితిలోనే యితనూ వున్నాడన్నమాట. 'రాణి'తో పరిచయం ఏర్పరుచుకోవడం, ఆమెకో ఉద్యోగం సంపాదించి పెట్టడం; ఆమెను వివాహం చేసుకోవడం జరుగుతాయి.

ఈ నవలలో ముఖ్యంగా — ముచ్చటగా కనిపించే విశేషాలు యేమిటంటే, దాదాపు మొదటి అరవై పేజీల వరకు 'రాణి' అనే అమ్మాయికి యేదో విపత్తు వచ్చింది, యేదో కష్టంలో ఉన్నది అనే మాటే ప్రస్తావితం అవుతూ అందరి సానుభూతి అమ్మాయి వయిపు ప్రసరిస్తూ వుంటుంది గాని ఆమె 'వితంతువు' అనే విషయం తెలివిడి కాదు. కథా క్రమంలో — సరళ అనే మరో వితంతువు ఇద్దరు పిల్లలు కలది, భార్య పోయిన మరో ఆసామిని వివాహం చేసుకొని సుఖంగా కాపురం చేస్తూ వుండడం ప్రస్తావితం అవుతుంది. ఒక రకంగా సరళ, రాణికి ఆదర్శప్రాయంగా నిలుస్తుంది.

ప్రేమను గురించి, సెక్స్ జీవితాన్ని గురించి అసహ్యము, అసభ్యము అయిన వర్ణనలు గాని సంభాషణలు గాని నవలలో యెక్కడా కనిపించవు. రాణి 'భూషణం' అనే అతని ఇంట్లో వున్నప్పుడు ఒంటరితనం స్త్రీకి ఎలా అపకారం చేస్తుందో సూచితం అవుతుంది. శాంతాదేవి సహాయంతో తను యిక వివాహం చేసుకోవడమే 'విధాయకం' అనే నిర్ణయానికి వస్తుంది.

రచయిత పాత్రలను పరిచయం చేసి పక్కకు తప్పుకుంటాడు. అంటే ఎక్కడా రచయిత ముందుకు వచ్చి సాంఘిక సంస్కరణావశ్యకత గురించి ఉపన్యాసాలు యివ్వడు. పాత్రలే తమ తమ పరిస్థితులను అనుసరించి అతి సహజంగా సంస్కరణ వయిపు ముందుకు అడుగువేసి తమ జీవితాలకు 'కొత్త చిగురు' పూయించుకుంటారు.

విధవా వివాహం మనలో ఒక పురుషుడితో కాకుండా, యుక్తవయసులో భార్యపోయిన పురుషుడితో జరుగుతున్నట్లు సూచించడం వల్ల స్త్రీ పురుషులకు సమాన ప్రతిపత్తిని, మానసిక ఆనందాన్ని చేకూర్చేందుకు 'సామాజిక న్యాయం' కృషి చేస్తోందనిపిస్తుంది.

'పరాయి నీడ' సైజులో 'కొత్త చిగురు' కంటే యింకా చిన్నది. ఇక్కడ 'లలిత' అనే అమ్మాయి రిటైర్డ్ హెడ్ మాష్టర్ గారి కుమార్తె. తండ్రి చనిపోవడంతో వరుసకు అన్న, వదిన అయిన రఘు, రమణుల దగ్గరకు చేరుతుంది. రఘుకు కుటుంబ మిత్రుడు వాసు. అతను తన స్నేహితుడొకడు చనిపోగా అతని వితంతువు, కుమారులకు తన యింటనే ఆశ్రయం ఇస్తూ వుంటాడు. ఈ వితంతువు 'కళ్యాణి' వాసు పట్ల తన మక్కువ పెంచుకుంటుంది కాని — అతను లలితను వివాహం చేసుకోబో

తున్నాడన్న విషయం రూఢిగా బయటపడేంత వరకూ, ఈ ఆప్యాయత ఆమె నుంచి ఉబికి పైకి రాదు. అప్పటికి యిది చాలా ఆలస్యం అయిన పరిస్థితి.

హేమ, జయరాం అనే అతనితో చనువుగా వుండడం, అరుణ అనే లలిత స్నేహితురాలు (యిద్దరూ ఉద్యోగ రీత్యా ఒకచోట పనిచేస్తూ వుంటారు) కృష్ణతో వివాహం నిర్ణయించుకోవడం-లలితకు స్ఫూర్తిదాయక మయిన టానిక్కులుగా పనిచేస్తాయి. అరుణ తన బాబాయి అనే ఆయన వావివరసలే కుండా ప్రవర్తించడం తాలూకు ఉపాఖ్యనాలు వింటే యెవరికయినా గుండెలు అదురుతాయి. బ్రతుకు అంటే భయం మాత్రమే కాదు, జుగుప్స కూడా ఏర్పడుతుంది.

హైదరాబాదు వంటి నగరాలలో ఒంటరిగా ఉద్యోగాలు చేసుకుంటూ ఉండే ఆడపిల్లలు-ఉద్యోగ విషయాలలో కంటే కుటుంబ పరిస్థితులలో యెక్కువ అసౌకర్యాలను ఎదుర్కొంటారనీ, 'పరాయి నీడ' పాము పడగ వంటిదనీ, ఏక్షణంలో నయినా యేమరుపాటుగా వుండేట్లయితే ప్రమాదంమీదకు దుముకుతుందనేందుకు యెలాంటి సంశయమూ లేదని యీ నవలలో సంఘటనలు విశదపరుస్తాయి. లలితకు మొదటి దశలో 'రాధ' ఊరట కలిగించినట్లుగా తరువాత కరుణాంబ, లీల, రమణి అండగా నిలుస్తారు. జీవితాన్ని యధాతథంగా అవగాహన చేసుకుందుకు ఆమెకు సహాయపడతారు.

జీవితానికి కొన్ని విలువలు వున్నాయి, ఇవి జీవితానికి మూల భూతమయినవి. ఇవి మాత్రం - రోజులతో పాటు, కాలంతో పాటు - మారుతూ వుండవు. కాకపోతే వాటి ప్రయోగము, అనుసంధానము మారుతూ వుంటాయి. విలువలకు కొత్త అర్థాలు చెప్పుకుంటూ, వాటిపైని జీవితం 'యధావతు'గా నిలబడి వుండి తన ప్రయోజనాన్ని సాధిస్తుంది. ఈ రకమయిన విలువలను గురించి తత్త్వనిరూపణల వంటిది చేసే ప్రయత్నం తలపెట్టకుండా, దాని అమలుకు మనుష్యులు యెలా కృషిచేసి జీవితాలను తరింపచేసుకుందుకు అవకాశం వున్నదో యీ నవలలు చక్కగా, సూక్ష్మంగా చెబుతాయి. 'తరింపు' అంటే తాము సుఖంగా వుండి తమ చుట్టూ వున్నవారు కూడా సుఖంగా వుండేట్లు అనుకూలమయిన వాతావరణాన్ని కల్పించటం తప్ప మరో గొప్ప 'వేదాంతార్థం' యిక్కడ చెప్పుకోనక్కర లేదు.

ఈ రెండు నవలికలూ వర్తమాన ప్రచురణలలో విశిష్టమయినవి. విసుగు లేకుండా చదివించేవి మాత్రమే కాక కాస్తో కూస్తో కొత్త రకపు సందేశాన్ని పాఠకులకు అందించి వారు కాస్సేపు ఆలోచించేట్లు చేస్తాయి.

## ముసుగు

టి. ప్రసన్నకుమార్

ముసుగు వదలి
ముసలి నేతలు
ముష్టి యుద్ధం చేసారు
కలిసుంటే విడిపోతారు
విడిపోతే పడిపోతారు !
లొసుగు తెలుసు కనుక
ముసుగులో మళ్ళీ దూరారు !!

# ఇన్‌స్టెంట్ కవితలు

## మిరియాల రామకృష్ణ

విషయం మనసులో ఉంచుకుని ఆశువుగా వేగంగా అప్పటి కప్పుడు చెబుతూ వ్రాయించిన కవితలు. వచన కవిత కాక ఎక్స్‌పెరిమెంటు మాత్రమే.

### 1. వయసు తగ్గింది

ఇది వరకు నా వయసు
నా శిష్యుడి వయసు
కన్నా
రెట్టింపు.
లోకం గుచ్చిన గునపాల
వల్ల
గుండె పోటు వచ్చి
మృత్యువుని చివాట్లు పెట్టి
తిరిగి వచ్చిన తరువాత
నా శిష్యుడి వయసులో
సగమే మరి
నా వయస్సు!

### 2. రెండు తరాల కథ

నేను
మీ ఊళ్లో చదువుకోడాని
కొచ్చినపుడు
విజయనగరంలో
నువ్వింకా చందమామ
రావే అంటున్నావు.
నువ్వు
మా ఊళ్లోకి ఉద్యోగాని
కొచ్చినపుడు
కాకినాడలో
నేను తలలో నెలవంకలు
ధరిస్తున్నాను.
ఇప్పుడు
నా జీతంలో సగం
నీ జీతం
అయినా
1958కీ 1978కీ
ఎంత తేడా ఉందో
అంత తేడా
మన జీవన విధానాల్లో.
ఏమయినా
నిన్ను చూస్తే నా
కాశ్చర్యం ఆనందం,
ఎందుకు అంటే
విజయనగరాన్ని
కాకినాడనీ
అడగమందాం!

### 3. కవిత్వం హత్య

అధికారం లేనివాడు
నాడి పట్టుకుని
కవిత్వానికి
సుస్తీ చేసిందన్నాడు!
హాస్పిటల్‌లో పెట్టి
పెన్సిలిన్ లాంటి
సూది మందులు
వెయ్యి ఇచ్చారు
డయాగ్నోసిస్ చెప్పలేక
గప్పాలు కొట్టారు!
మూడో రోజున
కవిత్వం హరీ అంది!

### 4. చరమహాసం

వికసించిన ఒక్క పువ్వు
ప్రకటిస్తుందొక్క నవ్వు
తనలాగే
జగమంతా
తళతళమని
మెరవాలని!

కానీ
ఈ లోకానికి
కళ్ళున్నా కనబడవు
చెవులున్నా వినబడవు
అందుకనే
పువ్వు కూడ
చాలించును
తన చిరునవ్వు!

# నిజ స్వరూపం

## వై. వి. ఎస్. ఎన్. మూర్తి

అద్దంలో
చూసుకుంటే
నా ప్రతిబింబం
కన్పిస్తుందన్న భయం
నా నిజ స్వరూపం
నగ్నంగా నర్తిస్తూ
వికారంగా నవ్వుతూ
వెక్కిరిస్తుందన్న భయం
నా ఆత్మ
నన్ను నిలదీస్తుందన్న
భయం
అందుకే
చూడను నేను
అద్దంలోకి.

# కళ్లు

కథానిక

మహీధర రామశాస్త్రి

నా పేరు వేణు. నేను చూడలేను. పుట్టుతూనే కళ్లు లేకుండా పుట్టాను. నాకు పాకుతోనే, మా యింట్లో మిట్టపల్లాలు, గోడలు, గడపలు తెలిసిపోయాయి. మాట ధ్వనిని బట్టి అమ్మ, నాన్న, తమ్ముళ్లు, చెల్లాయిలు పరిచయం అయారు. పెద్దయాక, వీధుల్లో నడవడం నా కాళ్లకి అలవాటయింది. ఊరంతా నాకు పరిచయమే!

నాకు పేరు పెట్టలేదు. ఇంటా బయటా అందరు "అబ్బి! సుబ్బి!" అని పిలుస్తూండే వారు. నన్ను వేణు అని పిలవడం చాలా విచిత్రం జరిగింది.

నాకు పదేళ్లు. ఓ సాయంకాలం నాకు వేణుగానం వినిపించింది. ఆ గానానికి నా శరీరం పులకరించింది. ఎప్పుడూ పొందని ఆనందం పొందాను. నాకు తెలియకుండానే, నా కాళ్లు నడిచాయి. క్రమేపీ ఆ గానం దగ్గరయింది. బాగా దగ్గరయాక, అక్కడ నిలబడిపోయాను. అయిదు నిముషాలయాక, వేణు గానం ఆగింది.

"బాగుందిరా, గుడ్డి సుబ్బి?" అని ప్రశ్నించారు.

అది మా అవధానులు గారి గొంతు. తల ఊపాను. దగ్గరగ రమ్మన్నారు. వెళ్లి కూర్చున్నాను. తిరిగి వేణు గానం సాగింది. ఆ లయకు నా శరీరం ఊగింది. అవధానులు గారు లయ మార్చారు. నా శరీరంలో కదలిక మారింది.

అది కేవలం కన్నాలున్న కర్ర గొట్టం మాత్రమేనని తెలుసుకున్నాను. దాన్ని పెదవి కాన్చి, గాలి పోస్తూ ఊదాలని అవధానులు గారే చెప్పారు.

"నన్ను ఊదనివ్వరా?" అని అడిగాను.

నా గొంతులో ఏ అభ్యర్ధన వారిని కదిలించిందో తెలియదు. నాకు మరో వేణువు నిచ్చారు. ఎలా ఊదాలో చెప్పారు. ఆయన వినిపించిన స్వరం తిరిగి మ్రోగించడం మొదలు పెట్టాను.

"పట్టు దొరుకుతూందిరా నీకు!" అన్నారు అవధానులు గారు. అలా ఆరంభమయింది నా వేణుగానం. ఇంటి దగ్గర వాయిస్తూ వుండే వాడిని. అప్పటి నుంచి నన్ను "వేణు" అని పిలవడం మొదలు పెట్టారు.

నిద్ర లేచింది లగాయితు, నేను చేసే పనులు పరిమితంగా వుంటాయి. నూతి పళ్ళెం దగ్గర నాకు ఓ పీట, డేగిసాతో నీళ్లు సిద్ధంగా వుంటాయి. పక్కనే సబ్బు వుంటుంది. స్నానం చేసి యివతలకు రావడం, గుడ్డలు మార్చుకోవడం నేర్చారు. రెండు పూటలా తిండి, సంగీత సాధన, నిద్ర; ఇదే నా దిన చర్య.

క్రమంగ నాకు కీర్తనలు, రాగ తాళయుక్తంగ వాయించడం వచ్చింది. ఇంటి వద్ద అదే పనిగా వాయిస్తూ సాధన చేసే వాడిని. నేర్పిన ప్రతి కీర్తన మరు నాటికల్లా ఎంతో చక్కగా వాయిస్తూన్నట్లు అవధానులు గారు చెప్పేవారు. అవధానులు గారు ఏది వాయిస్తే, నేనూ

అయనతో కలిసి సమంగ వాయించడం మొదలు పెట్టాను, ఓ సారి మా వూరు ఓ వైలనిస్టు వచ్చారు. ఆయన నా వేణు గానం విన్నారు. నన్ను రేడియోలో ప్రయత్నించ మన్నారు.

మా యింట్లో వాళ్లకి నా మీద శ్రద్ధ పుట్టింది. సాధన సాగుతూనే వుంది. మావాళ్ల సంప్రదింపులు ఫలించాయి. నన్ను రేడియో స్టేషనుకి తీసుకు వెళ్ళారు. మా వూరు నించి పొరుగూరు వెళ్ళడం నాకిది మొదటిసారి. నాతో కూడా నాన్న ఉండే వారు. బండి బస్సు, రైలు అనుభవాలు విచిత్రంగ జరిగాయి. చూడలేక పోతున్నందుకు విచారం కలిగింది. ఈ విచారం మొదటి సారి నా చిన్నతనంలో కలిగింది.

ఓ సారి, మా తమ్ముడు ఓ బొచ్చు కుక్క పిల్లని తెచ్చాడు. అంతా దాని చుట్టూ మూగి, సంతోషంతో గెంతుతూ దాన్ని పొగుడుతున్నారు. "ఎంత బాగుందో ! ఎంత మెత్తగా వుందో ! ఎలా చూస్తుందో ! ఆ తెల్లని వొంటి మీద నల్లని మచ్చలు బాగున్నాయి కదమ్మా ?"

ఇలా సాగింది, వాళ్ళ సంబరం. ఆ బాగు నాకు తెలియదు కదా? అది ఎలా చూస్తూందో నాకు తెలియదు. నా కన్నా అది అదృష్టవంతురాలు. అందరినీ చూడగలుగుతూంది. తెలుపు, నలుపు తారతమ్యం తెలియని నాకు, దాని అందం ఎలా తెలుస్తుంది ?

"ఒరే! నన్ను చూడనివ్వండర్రా!" అన్నాను.

"ఏం చూస్తావు నువ్వు ?" అనే వారు అంతా.

నాన్న దాన్ని నా చేతుల కందిం చారు. పట్టు శాలువా అంచుల కుచ్చుల్లా మెత్తగా తగిలింది దాని వొళ్లు. దాని తోక, కాళ్ళు, మూతి ఎలా ఉన్నాయో, ఎక్కడ తెల్లగా ఉందో, ఎక్కడ నల్లగా ఉందో, వివరించి చెప్పారు నాన్న. శరీరం అంత ఒకలాగా, కాళ్ళు, చెవులు మూతి మరొకలా ఉన్నాయని అర్థం అయింది. ఇలా చూడలేని విషయాలు చూసినట్లు నాన్న నాకు చెబుతూ వుండేవారు.

* * *

రేడియో స్టేషనుకి మా గదికి తేడా ఏమీ తెలియలేదు. మామూలుగ, అవధానులు గారి ముందు వాయించి నట్టే వాయించాను. మెచ్చుకున్నారు ; రికార్డింగ్ జరిగింది.

నాకు రేడియోలో మురళీ గానం చేసే అవకాశం వచ్చిందని తెలిసి అవధా నులు గారు చాలా సంతోషించారు.

రేడియోలో నాకు పేరు వచ్చింది. ఎందరో సంగీత విద్వాంసుల పరిచయం లభించింది. ఎన్నో మెళు కువలు తెలుసుకుని నా గానానికి మెరుగులు దిద్దుకున్నాను. క్రమేపీ నా స్థితి మారింది. నా కొక ఉపాధి దొరికింది. మా వాళ్ల మనస్తాపం తగ్గింది.

మనిషి మనసు విచిత్రమైంది. ఓ కోరిక తీరాక, మరో కోరిక మొల కెత్తుతుంది. ఇది చచ్చేవరకు సాగు తుంది. నా భవిష్యత్తును గురించి ఆందో ళన తగ్గాక, సంగీతం నా జీవనోపాధి అయాక, మరో కోరిక బయలు దేరింది మా వాళ్లకి.

నాకు పెళ్లి చేయాలని! కట్నం

వద్దన్నారు. పెళ్ళి ఖర్చులు భరిస్తా మన్నారు. కాని, కట్నం తీసుకోని వాడినే పెళ్ళాడతానని శపథం పట్టిన ఏ అమ్మాయి కూడా నన్ను పెళ్ళాడ్డా నికి సాహసించ లేదు.

"కట్నం తీసుకోని ఆదర్శవంతు డికే యిస్తాను నా కూతురిని!" అన్న ఏ ఆడపిల్ల తండ్రి నన్ను అల్లుడిగ పొందదలచ లేదు!

గుడ్డివాడి ఆదర్శం గుడ్డిదే అవు తుంది!

కాని – "అవదు" అనుకున్న నా పెళ్ళి అయింది.

ఓ సుశీల పినతండ్రి, ఓ రోజు మా యింటికి వచ్చి –

"మా అన్నగారమ్మాయి, సుశీలని చేసుకోమని అడుగుదామని వచ్చాను. మా వదిన గారు, ప్రమాదవశాత్తు వంటింట్లో చీర అంటుకుని పోయింది. ఆ బెంగతో, మా అన్నగారు గుండె ఆగి నెల తిరక్కుండా పోయారు. సుశీల భారం నా మీద పడింది. దీనికి పెళ్ళి యీడు వచ్చింది. మీ వాడి గుణ గణాలు విని ముగ్ధుడ నయ్యాను. మీ వాడికిచ్చి చేసేస్తే, పిల్ల సుఖప డుతుంది. మరి . . . ."

"పిల్లకి యిష్టమేనా?" మా అమ్మ ప్రశ్న.

"ఏమండోయ్! ఇష్టమా అని అడుగు తున్నా రా? మీ వాడి వేణుగానం రేడియోలో విని మక్కువ పెంచు కుంది. ఇంక దృష్టా? వాళ్ళే సర్దుకు పోతారు. ఏమంటారు?"

అనడాని కేముంది? అనుకున్న ఆరో. నాటికి, అతి సామాన్యంగా వివాహం జరిగి పోయింది.

"సుశీల మంచిది!" అన్నారు మా యింట్లో అంతా. మంచిది కాకపోతే, అంధుణ్ణి నన్ను ఎందుకు కట్టు కుంటుంది, కాపురం చేస్తుంది? నా అంధత్వం మా దాంపత్య జీవితానికి అడ్డు రాలేదు. గతంలో పోగొట్టుకున్నది ఏదో పొందినట్లు అనిపించింది. సుశీల కళ్ళే నా కళ్లు!

రేడియోలో వాయించడం వచ్చాక, హైదరాబాదు మకాం మార్చేశాము. నాకు సంగీత పాఠాలు కూడ దొరుకు తున్నాయి. కళ్లు లేక చాలా పాఠాలు వదులు కోవలసి వస్తూంది. కళ్లు వస్తే మా ఆదాయం రెండితలు అయే అవకాశాలున్నాయి.

సుశీల కోరిక నాకు కళ్లు రావాలని సుశీల ఎందరో కంటి వైద్యులను సంప్రదించింది. డా॥ చక్రవర్తి నన్ను పరీక్షించి, "అపరేషను చేసి, కంటి గ్రుడ్లు మారిస్తే, చూపు రావడానికి అవకాశం ఉంది!" అన్నారు. ఐ బ్యాంకులో కళ్ళు సరియైనవి దొరికి నప్పుడు, అపరేషన్ చేద్దామని చెప్పారు. ఎవరయిన కళ్లు దానం యిస్తే మరింత చవగ్గ, చురుగ్గ జరుగు తుందని డాక్టర్ చక్రవర్తి చెప్పారు.

సుశీల ప్రయత్నాలు ఫలించాయి. మూత్రపిండాలు పాడయి, ఓ యువకుడు హాస్పిటల్లో చేరాడు. అతను బ్రతకడం దుర్లభం అని తేలిపోయాక, సుశీల ఆ యువకుని సంప్రదించింది. ఆ యువ కుడు సుశీల ప్రార్థన ఆలకించాడు. తను జీవించేది ఎలాగూ లేదు. కనీసం తన కళ్లు మరో జీవికి మార్గం చూపితే దానం చేయడం ఉత్తమ మార్గంగ తోచింది.

ఆపరేషను జరిగింది. ఓ రోజు చీకటి గదిలో కట్లు విప్పి నాకు చూపు రప్పించారు. నెమ్మదిగ కళ్లు తెరిచాను. నీడల్లా మనుషులు కనిపించారు. నెమ్మదిగ లైట్లు వెలిగాయి గదిలో. డాక్టరుని చూడగలిగాను. ఎంత ఆనందం! ఇన్ని రోజుల అంధకారాన్ని పారద్రోలి దివ్యకాంతులు జీవితం నిండ పండించుకోవాలి. నాలో ఎంత ఆరాటం!

సుశీల అందాన్ని చూడ గలిగాను. కళ్లు లేనప్పుడు సుశీల మానసిక సౌందర్యాన్ని చవి చూచాను. కళ్లు వచ్చాక సుశీల శారీరక అసౌందర్యాన్ని చూసాను.

సుశీల కురూపి! నలుపు. శరీరం రోమమయం. స్త్రీ సహజమైన ఆకర్షణ ఆమె రూపానికి లేదు. "సుశీల మంచిది!" అని మావాళ్ళు అన్నప్పుడు, ఆ మంచితనం మరోలా కనిపించింది. సుశీల పట్ల నా మనస్సు ఆకర్షింపబడదు!

చూపు రాకపోయి వుంటే ఎంత బాగుండును!

ఈ కళ్లతో చూస్తూ, నేను అంధుడనైనప్పుడు నా జీవనజ్యోతిగా నిలచి, ఆ అంధుణ్ణి ప్రేమించిన ఈ ఉదార మూర్తి మానసిక సౌందర్యాన్ని ఇప్పుడు ప్రేమించలేను. పాడు కళ్లు! ఇప్పుడు వీటిని తీసేసినా, ఆమె బాహ్యరూపం నా మనస్సులో నుంచి పోదు కదా!

కళ్లు వచ్చాక, నిజమైన ఆమె ఆత్మ సౌందర్యాన్ని చూడలేని అంధుడనయి, చేతులారా నా స్వర్గాన్ని నరకం చేసుకున్నాను.

దేవుడా! ఎంత పని జరిగింది!

(ఫిబ్రవరి 78 - 'తెలుగు అమెరికా'లో ప్రచురింపబడిన కథ.)

## ఆరని మంటలు . . . యన్నం రెడ్డి వెంకట రెడ్డి

మండుతున్నాయ్ మంటలు
పొగలు - సెగలుగా!
రేగుతున్నాయ్ జ్వాలలు
నిప్పు కణికలుగా!

పసిగా కాల్చాలని పేదవారి కొంపల్ని
మసిగా మార్చాలని ఉన్నవారి ఆస్తుల్ని
అగ్ని జ్వాలలు ఆకాశానికి
కూలిన కప్పులు భూతలానికి
మట్టిపాలు చెయ్యాలని
పొట్ట చేతికియ్యాలని
ఆరాట పడుతోన్నాయ్ -
ఆకలి మంటలతో
పోటీలు పడుతోన్నాయ్!

## నిజం . . . జయధీర్ తిరుమలరావ్

పచ్చని ఈ పంట
కర్షకుల కలల పంట
పండింది ఇది
కూలీల చెమట పారగా కాల్వల వెంట

ఐనా...

తమ కడుపు ఇంట
మండుతునే ఉంది ఆకలి మంట
దీనికి కారణం వాళ్ళకు తెలిస్తే
తప్పదు!
కూర్చొని తిన నేర్చిన వాళ్ళకు తంటా

# ప్రాణశక్తి

## (కావ్యపరిశీలన)

సోమసుందర్

యువ కవి శ్రీ అదృష్ట దీపక్ ఇటీవల తన కవితా సంపుటి 'ప్రాణం' ప్రచురించారు. అందులో అత్యాధునిక కవితోక్తిమయ ప్రపంచం దర్శన మిస్తుంది. (14 క్రౌన్. 60 పుటలు. వెల: 2.00. విశాలాంధ్ర ప్రచురణాలయం, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ - 4.)

"ఆమె పతిత
జీవన గ్రంథంలో అసంబద్ధ కవిత..."

వంటి వాక్య విన్యాసంలో కవి శక్తి ద్యోతకమవుతుంది. హృదయాన్ని చూరగొనే రమణీయోక్తుల ద్వారానే కవిత్వం వజ్రాలు పొదిగిన ఆభరణంగా తనరారుతుంది. నితాంత భాసురమవుతుంది. వ్యంజనా శక్తి ద్వారానే కవిత వచనం నుంచి తన్నుతాను కేటాయించుకుంటుంది. పాఠకుని హృదయంలో కవి పునరవతరణ పొందగలుగుతాడు. ఆలోచించిన కొద్దీ సహృదయుని హృదయంలో అమృత రసా లూరించగలుగుతుంది. ఇలాంటి అభివ్యక్తులే సమకాలీన జీవనాడిగా కవిని రూపొందించే సన్నివేశాలు.

' "ప్రాణం" లోని కవితలలో అసమగ్ర సౌధం' అనే దొక ఉత్తమ కవిత. పునః పునః పఠనా సక్తి కలిగిస్తుంది. ఎడారి అనే కవితలో "పగలంతా వీధుల నిండా అంటు రోగంలా తిరుగుతాడు!" అంటూ నిరాధారంగా తిరిగే మధ్యతరగతి కర్తవ్యతా విమూఢత్వానికి చక్కని కవితా వ్యాఖ్య చేకూరుస్తాడు. అలాంటి లోఫర్లు — "శ్రుతి తప్పిన ఆలాపనతో గీతాన్ని చిత్రవధ చేసే అసమర్థ గాయకులు" గా పేర్కొనడం హృద్యమైన అభివ్యక్తి. ఇలాంటి గాయకుల వల్ల ఆత్మద్రోహమే గాక, పరహానీ సంభవిస్తుందని కవి వ్యంగ్యం!

'అరుణ రాగం' అనే కవితలో— "యువతరం ఆలోచనలను ఉద్రిక్తంగా ఉత్ప్రాంగించగల కదన కుతూహల రాగం" అవతరించాలని ఆశిస్తాడు. కవిత్వం— తన సహజాత కళ సంగీతాన్నీ, దాని అవిరళ సౌరభాన్ని స్వాయత్తం చేసుకోకుండా బ్రతక లేదు. ఆధునిక కవిత్వం సంగీత కళ స్థాయికి ఎదగడానికే నిరంతర యత్నం చేస్తుంది అన్న ఒక విజ్ఞుని సూక్తి నిరర్థకం కాదు. కనక యిక్కడ కదన కుతూహల రాగాన్ని పేర్కొనడం దుర్ధ్వనియోగం కాదు. అందలి పదార్థమేగా ఆ రాగ స్వరూప స్వభావాలనూ, సముత్సాహ గతినీ అవగతం చేసుకొన్న వారికి ఈ రూపంలోని మాధుర్యం అవగతం కాగలదు.

కాని "క్రాంతి గీతం"లో "నిరాశను వెదుక్కుంటూ వచ్చి అవకాశం ఆత్మవంచన చేసుకోదు" వంటి అస్పష్ట నైరూప్య చిత్రాలు విగత ప్రాణులు! నైరూప్యత కవికి ప్యాషనుగా కాక, కవితకు యెడనెడ అర్థపుష్టి గల ఫ్యాషను (Passion) గా అమరిన నాడు జీవన ధాతువుగా భాసించ గలదు.

"కన్నీళ్ళ సముద్రంలో
కత్తుల కెరటాలు లేస్తాయి!"

అనే అభివ్యక్తి స్వోపపత్తికమూ, మౌలికమూను. యదార్థాన్ని కల్పనా.

జ్యోతిస్సీమల కెత్తి విహరింప చేయగల నవద్య భావ శకలం! అలాంటిదే—

"అయోమయంలోంచి
అక్షరాలు అవతరించవు
నైరాశ్యంలోంచి
విప్లవాలు ఉప్పొంగవు...."

అనే ఆత్మీయ సత్యాన్ని అనుక్షణం ప్రతి యువ కిశోరమూ మననం చేసుకోక తప్పదు. 'సశేషం' అనే కవితలో భారత జాతి వర్తమాన స్థితిని చక్కగా చిత్రిస్తాడు:

"జీవన సమరంలో
చితికిన బతుకుల ఆలోచనలు
గుర్రం కరుస్తుందని భయపడి
గాడిద వెనకాల తలదాచు
కున్నాయి!"

అనే అభివ్యక్తి గొప్ప వ్యంగ్యం! కాని ఆ నాలుగు పాదాలకూ వ్యాఖ్యాన వతుగా మిగిలిన ఇరవై ఎనిమిది పాదాలు కొనసాగడం వ్యర్థం! అభ్యుదయ కవిత్వం తన్ను తానే వ్యాఖ్యానించుకుంటూ సాగడం గర్వకారణం కాదు.

'జండా' అనే కవితలో— "అక్షరాలకు శిక్షలు రద్దు చేశారనే అందమైన కల వచ్చిం" దనడం రమ్యంగా ఉంది. "రాత్రంతా వెన్నెల కాలిపోయినవాసన" అనేది కూడా అపూర్వాభివ్యక్తే! పాఠకుని ఆపి, అతని హృదయాన్ని చింతాక్రాంతం చేస్తుంది.

"రాబోయే ఉదయాల
హృదయాన్ని
రంగుల హరివిల్లుతో అలంకరించి
రోదనలూ వేదనలు లేని
ఆగామి చరిత్ర అధ్యయనానికి
అ ఆ:లు రాయండి!"

అనే తాత్త్విక ఆవేశ భూమిక నుంచి ఆశావాదం ఉద్భూత మవుతుంది. రమణీయ కవితోక్తిగా భాసిస్తుంది.

"బంగారు లేడి లాంటి భవిష్యత్తు వెనుక పరుగులు తీస్తున్న పిచ్చివాళ్లు... తటస్థం గడప మీద అసుర సంజ వేళ తల వంచుక కూర్చున్న దుఃఖ భాజనులు... వేతనాల చంద్రుడిప్పటికీ శుక్లపక్షంలో ప్రవేశించనిజీవితాకాశాలూ..." వంటి సుదీర్ఘ వ్యాఖ్యాపేక్షమైన సుందరోక్తులను ఈ కవి అనాయాసంగా నిక్షిప్తం చేయగలడు. పురాణ ప్రసిద్ధ రూపారోపణల ద్వారా తన హార్దిక సంస్కారాన్ని విని యోగించుకోగలడు. చక్షు రక్షర సంయోగ యాత్రలో పాఠకుని గమనాన్ని అడుగడుగునా ఆపి, విశ్రాంతి కలిగిస్తూ ఆలోచనల సరోవర శీతలోదకాలలో ఈదులాడించగలడు. భావనామయోన్నత లోకాల కెగిరించనూ గలడు.

"ఈ గీతం—సామాన్యుడి జీవితం
రమణీయార్థ ప్రతిపాదక శబ్దాల
కోసం
రసాత్మక వాక్యాల కోసం —
వెదకబోకండి!"

అంటూ గడసరి తనంతో పాఠకులను హెచ్చరిస్తాడీ కవి. పురాణ ప్రతీకల వైభవంతోనూ, వారసత్వ మందించే రమణీయార్థాలతోనూ, తన కవితను సంపన్మయం చేసుకోవాలనే తృష్ణ సర్వత్రా ఎదురవుతున్నపుడు ఆ సలహాను పాఠకుడు పాటించడు. కవితా నైపుణ్యం పట్ల ఈ కవి బద్ధ బుద్ధుడు కావడం వల్ల తద్భిన్నమైన తావులలో పాఠకుని వేళ్లు నిలవకనూ తప్పదు. నికృష్ట వర్తమాన జీవితాన్ని ప్రతిబింబించేదైనప్పటికీ మన కవిత్వం తాను కూడా నికృష్ట కాలుష్యాల నింపుకో నక్కర దన్న ఉత్తమ కవితా వారసత్వం ఈ

యువ కవికి లభించింది. కవితా రసజ్ఞుడు రసాత్మకత కోసం జరిపే అన్వేషణ సైతం అంత చప్పున విరమించబడేదీ కాదు. ఉత్తమ కవిత పాఠకుని ఊహా శాలిత్వానికి ఉపాధి కల్పన చేయడమనే పరమ ప్రయోజనంనుంచి అంత త్వరగా నిష్క్రమించదు. కవితా రసజ్ఞుని భావుకత్వాన్ని ప్రబుద్ధం చేసే ఉత్తమ కవిత కోసం గవేషణ చిరంతనంగా సాగేతీరుతుంది కూడా! పెట్టుబడిదారీ వ్యాపార వ్యవస్థ మన కాలాన్ని ఎంతగా వచన యుగంగా మార్చుతున్నా-కవితా విర్భావం ఉదాత్త భూమికగా పరిగణింప బడుతూనే ఉంది.

"ఒక మూల ఒదిగి, తన పైకి నిత్యం దండెత్తే లోకానికి జాగా కల్పించే అడవి అంటుకున్నదంటే ఆర్పడం-" ఎవరి తరమూ కాదన్న దర్శన ఈ కవి గుండె నిండా ఉంది. కనుకనే "మీ కాళ్ళ క్రింద పడి పగిలిన గాజు పెంకులే పదునైన ఆయుధాలుగా మీ పై పగతీర్చు కుంటాయి!" అని హెచ్చ రిస్తాడు. నిస్సహాయపు అడవులపై నిత్యం దాడి చేసే గుండెలేని గొడ్డు గొడ్డళ్లకు సుందర కంఠోక్తిగా ఉద్ఘో షిస్తాడు.

ఇట్టి అభివ్యక్తి సౌందర్యాన్నీ, ధ్యాన మగ్నతనీ, పరాత్మకపరిశీలననీ మరిం త సంయమంతో అలవర్చు కుంటే ఈ యువకవి భవిష్యత్తు అదృష్టోర్ధ్వగమ నమే! అతి వ్యాప్తినీ, అయోమయతనీ పరిహరించుకొని, నిరంతరాభ్యాసం ద్వారా తన లేఖినికి నైశిత్యం చేకూర్చు కుంటే ఉత్తమ కవితలు వెలార్చగల డన్న భరోసా నాకుంది. ఈ కవి ఉన్నత విద్య నభ్యసిస్తున్న విద్యార్థి కనక - ప్రాక్ ప్రతీచీ లోకాల ఉత్తమ కవితలను అధ్యయనం చేయడం ద్వారా తన కవితా హృదయాన్ని సుశిక్షితం చేసుకోగలడన్న విశ్వాసం నాకుంది. ఒకసారి యాదాలాపంగా చదివినా జ్ఞాపకంలో మిగిలిపోయే హృదయంగ మోక్తులు అదృష్ట దీపక్ కవితలో దర్శనమిస్తాయి. అట్టివే అభ్యుదయ కవితకు ప్రాణశక్తి!

## కడలి కాపురం . . . . . టి. ప్రసన్నకుమార్

నిదుర పోయే నీళ్ళలో
ఎగిరిపడే అలల మగతనం చూసి
ఆకాశం ఆడపిల్లగా మారింది!
వెన్నెల తలంటి పోసుకుని
చందమామను బొట్టు పెట్టుకొంది
మబ్బుల చీర కట్టి
మత్తుగా సంద్రాన్ని
ముద్దు పెట్టుకుంది!
పిల్ల గాలిని చల్లబరచి
తీరాన్ని పలకరించి
తిరిగి వచ్చిన జలంపై
అందం చిందించి
పూల బాణం వేసింది!
శరం వరంగా మారి
అనంత శూన్యానికి
అంతులేని అగాధానికి
పెళ్ళి చేసింది!
వాటి కడుపున
పశ్చిమంలో చచ్చిపోయిన
పగలు మళ్ళీ పుట్టింది!

# టర్కీ విప్లవ కవి నాజిం హిక్మత్

"విశ్వామిత్ర"

స్వేచ్ఛ కోసం, ప్రజాస్వామ్యం కోసం, తన దేశంలోనూ, ప్రపంచమంతటా కూడా పీడిత తాడితుల పక్షాన, శ్రమజీవుల పక్షాన కలం పట్టి దాదాపు నాలుగున్నర దశాబ్దాలపాటు పీడకులపై హోరాహోరీ పోరాడిన టర్కీ స్వాతంత్ర్య యోధుడు, విప్లవకవి నాజిం హిక్మత్.

1930 దశకంలో ఆయన తన కవితలో "ప్రపంచానికి, మా వీధి మొగలోని పచారీ కొట్టు అతణ్ణి గురించి ఎంత తెలుసో, నా గురించీ అంతే తెలుసు" అని చెప్పుకొన్నారు. ఇది ఆయన నమ్రతే తప్ప పూర్తి సత్యం ఎంత మాత్రమూ కాదని ఘంటాపథంగా చెప్పవచ్చు. అప్పటికి ఆయన కవితలు విదేశాలల్లో ప్రాచుర్యం పొందని మాట నిజమే. అయినా, ఆయన అనాటికే టర్కీలో జాతీయ కవిగా ప్రతిష నార్జించు కొన్నారు. ఆయన కవితలు ఆ దేశ ప్రజల నుర్రూతలూగించగా, పాలకులకు గంగ వెర్రులెత్తించసాగాయి. 1963 లో మాస్కోలో తనువు చాలించే నాటికి, ఆయన సాహితీ లోకంలో పాబ్లొ నెరుడా (ఛిలీ), లూయి అరగాన్ (ఫ్రాన్స్) లాంటి మహాకవుల శ్రేణిలో స్థానం సంపాదించారు.

టర్కీకి చెందిన ఒక సంపన్న భూస్వామ్య కుటుంబంలో పుట్టినప్పటికీ, నాజిమ్ హిక్మత్ ఆదినుంచీ మానవతా దృష్టితో పేదల పక్షమే వహించారు. 1916లో ఆయన కవితా వ్యాసంగం ఆరంభించారు. అప్పటికే ఆయన స్వాతంత్రోద్యమంలో పాల్గొన నారంభించారు. 1921లో ఆయన స్వాతంత్రోద్యమంలో పూర్తిగా నిమగ్నమయారు. ఆ తరువాతనే ఆయన కవితలకు మరింత విషయపుష్టి చేకూరి పదును వచ్చింది.

ఆయన దాదాపు 40 ఏళ్ల పాటు కవిత్వం రాశారు. ఆయన కవితలలో చాలా భాగం శత్రువుల చేతుల్లో పడి ధ్వంసమయాయి. మొత్తం మీద ఆయన దాదాపు ఒక లక్ష పద్య పాదాలు రాసి వుంటారని అంచనా.

నాజిం హిక్మత్ గొప్ప కవితా శిల్పి. వస్తువుకే గాక, రూపానికి కూడా ఆయన ఎంతో ప్రాముఖ్యమిచ్చేవారు. ఒక్కొక్క పద్యాన్ని, ఎన్నోసార్లు తిరగ రాసేవారు. ఆయన ఒక్కొక్క సారి వేయి పంక్తులుదాకా రాసి, చివరకు పాఠకుల చేతికి వచ్చే సరికి నూరు, నూట పాతిక పంక్తుల కన్నా ఎక్కువ మిగల్చని సందర్భాలెన్నో వున్నాయని ఆయన సన్నిహితులు, పరిశోధకులు చెబుతారు. మొదట్లో ఆయన టర్కీ కవితా సాంప్రదాయానికి అనుగుణంగా ఛందోబద్ధంగా కవితలల్లారు. కాని, 1922 నాటికి ఆయన తన కవితా వస్తువుకు ఆ ఛందస్సు సరిపడదని నిర్ధారణకు వచ్చి వచన కవిత్వం రాయ నారంభించారు. కవితా

ప్రక్రియల విషయంలో ఆయన లెక్కలేనన్ని ప్రయోగాలు చేశారు. ఏ కొత్త పద్ధతిని చేపట్టినా ఆయన తపన ఎల్లప్పుడూ ఒక్కటే — తాను చెప్పేదేదో శ్రోతల హృదయంలో సూటిగా, పదునుగా నాటుకొనేందుకు అది ఉపయోగపడాలి – ఆ ప్రయోజనం నెరవేర లేదనిపిస్తే ఆయన ఆ రూపానికి నిష్పంకోచంగా స్వస్తిచెప్పి, మరో రూపంకోసం అన్వేషణ ఆరంభం చేసేవారు. ఆయన కొంతకాలం పాటు రష్యన్ ఫ్యూచరిస్టులను (అర్థ ప్రాధాన్యం లేని అక్షర సముదాయాలతో సాగే కవితా ప్రక్రియ వీరిది), ధ్వని ప్రధానమైన డాడాయిస్టు ప్రక్రియలను ప్రయోగించి చూచారు. అయినప్పటికీ తన కవిత్వంలో వస్తువుకు భంగం రాకుండా చూచేందుకు ఆయన ప్రయత్నించారు. కాని, అది సాధ్యం కాదని తెల్సుకొని, ఆ రూపాలను విసర్జించారు. ఆ తరువాత ఆయన రష్యన్ కవులు మయకోవ్‌స్కీ, స్వెత్లోవ్‌ల కవితలు కొన్ని విని, తనకు రష్యన్ భాష రాకపోయినా, వారి లయబద్ధమైన వచనా కవితా శైలిని సొంతం చేసుకొన్నారు. ఈ పద్ధతిలో పొట్టి పొడుగు పాదాలను కూర్చటం ద్వారా, తాను వ్యక్తం చేయదలచుకొన్న భావాన్ని స్ఫురింప జేసే ధ్వని కల పదాలను ఎంచుకొని ప్రయోగించటం ద్వారా మంచి ఫలితం సాధించ వచ్చని ఆయన నిర్ధారణకు వచ్చారు. ఈ పద్ధతిలో ఆయన రాసిన తొట్టతొలి కవిత "అన్నార్తుని చూపు" ఎంతో మన్నన పొందింది.

నాజిం హిక్మత్ ప్రశస్తమైన కావ్యాల్లో షేక్ బద్రుద్దీన్ గాథ ఒకటి. దీన్ని 1963 లో రాశారు. ఇది టర్కీ సాహిత్య విమర్శకుల ప్రశంసలను ఎంతగానో చూరగొన్నది.

15 వ శతాబ్ది ప్రారంభంలో అట్టోమాన్ చక్రవర్తుల నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా సాగిన ఒక రైతు తిరుగుబాటు గాథ యిది. ఈ తిరుగుబాటుకు నాయకత్వం వహించిన షేక్ బద్రుద్దీన్, మార్క్స్‌కు నాలుగు వందల సంవత్సరాల ముందే ఊహావాద సోషలిస్టు భావాలను, సమతా ధర్మాన్ని ప్రబోధించాడు. పాలకులు, చివరకు ఆ తిరుగుబాటును రక్తపు టేరుల్లో ముంచి అణచి వేశారు.

వారు గొంతు కలిపి పాడారు,
చేతులు కలిపి వలలు విసిరారు,
ఇనుము కరిగించి జిగిబిగి నగిషీలు చెక్కారు,
కలిసి పొలాలు దున్నారు,
అత్తి పండ్లు అంతా కలిసి ఆరగించారు.
వారంతా అన్నీ కలిసి అనుభవించారు
ప్రియురాలి పెదాలు తప్ప

* * *

పది వేలలో, ఎనిమిది వేలు
తమ ప్రాణాల్ని బలిపెట్టారు
చివరకు వారు ఓడిపోయారు
విజేతలు రక్తం ఓడే తమ కరవాలాల్ని

అంగరఖాలతో తుడిచేస్కున్నారు.
(షేక్ బద్రుద్దీన్ గాథ)

ఈ రచనలో నాజింహిక్మత్ వచనలో కవితలో ఒక గంభీరమైన లయను సాధించారు. పాత్రోచితమైన భాష నుపయోగించారు. పాఠకుల్ని, ఆ రైతు పోరాటం జరిగిన ప్రాచీన కాలంలో జీవింప జేసే ప్రయత్నంలో ఆనాటి టర్కీ భాషను సైతం ఉపయోగించారు.

నాజిమ్ రచించిన మరో సుప్రసిద్ధ కావ్యం "నా దేశ మానవాకృతులు." ఆయన తన పదమూడేళ్ల కారాగార జీవితంలో దీన్ని రాశారు. కొందరు మహా పురుషుల జీవిత గాధలను ఒక కావ్యంగా మలుద్దామని ఆయన మొదట అను కొన్నారు. చివరకది టర్కీ మహాప్రజలు, అంతకు ముందు అర్థ శతాబ్దికాలంలో సాగించిన రాజకీయ, సామాజిక పోరాటాల చరిత్రగా, టర్కీ జాతి సామాజిక, ఆర్థిక పరిణామ చరిత్రగా రూపొందింది.

సామ్రాజ్యవాదాన్ని, అభివృద్ధి నిరోధకుల్ని నిరసించినందుకు యీ కవి తన మాతృ దేశానికి వెలిగా చిరకాలం జీవించవలసి వచ్చింది. ఈ వేదనను ఆయన, "ముప్ఫయి - నలభై భాషల్లో నా కవితలు వెలువడ్డాయి, కాని నా టర్కీ దేశంలో, నా టర్కీ భాషలో అవి నిషేధింప బడ్డాయి'' అని ఒక కవితలో వ్యక్త పర్చి, తాను విదేశాలలో జీవించ వలసివచ్చిన పరిస్థితిని గురించి తన దేశాన్ని సంబోధించి యిలా చెప్పారు: "నాటోపీ నీ ప్రదేశాలలో తయారు చేసినది కాదు, నీ బాటలలో నడిచేవి కావు నా జోళ్లు, నీ చివరి చొక్కా నా వీపు మీద చిరిగిం దెప్పుడో, నువ్విప్పుడు నా నెరిసిన జుట్టులోనూ, నీరస పడిన నా గుండెలోనూ, నా నొసటి ముడత లోనూ మాత్రమే వున్నావు.''

టర్కీ ప్రజల జీవితానికి, వారి ఆశలకు, ఆశయాలకు, వాటి సాధనకోసం వారి పోరాటానికి అద్దం పట్టిన గొప్ప ప్రజాకవి నాజిం హిక్మత్. జనానికి దూరంగా కూర్చుని వారికి బోధలు చేసే కవికన్నా, కార్యశీలి అయిన కవి మరింత గొప్ప కళాకారుడు కాగల డనేందుకు ఆయన దృష్టాంతం.

**కవితా వస్తువూ, రూపమూ**

"... రూపాన్ని, వస్తువుకు తగ్గట్టు, కుదిరికతో సంతరింపు చేసుకోవాలన్నదే నా అభిమతం. వస్తువును అది స్పష్టంగా విశదీకరించ గలగాలి. అయినా, ప్రముఖంగా వ్యక్తం కాకుండా అంతర్లీనమై, మహిళ కాళ్లకు అందాన్ని యిచ్చే సిల్కు మేజోళ్ళలా ఒదిగి పోవాలి.''

— నాజిం హిక్మత్

(ఆధారం "లోటస్'' ఆఫ్రో, ఆసియా రచయితల సంఘ పత్రిక, 1975)

# మెదడుకు మేత

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారు తన 'కథలు గాథలూ'లో కవులూ, రచయితలూ తెలుసుకోవలసినవీ, ఆలోచించవలసినవీ చాలా విషయాలు రాశారు. దిగువ వాటిలో కొన్ని, బ్రాకెట్లలోనివి ప్రకరణాల శీర్షికలు.

కవికి ఇతర గురువు లెందరు వున్నా ప్రధాన గురువు ప్రకృతి. అంటే ప్రపంచకమే, అనగా సంసారమే. సంసారమంటే? కొందరు ఇల్లూ, వాకిలీ, పెండ్లామూ, బిడ్డలూ, గొడ్డూ గోదా మాత్రమే అనుకుంటారు. కృష్ణా గుంటూరు డిస్ట్రిక్టులలో సంసారి అనే పేరు వ్యవసాయకునికే రూఢంగా వాడుతూ వుంటారు. నేను వ్రాసిన సంసార పదఁ, యిప్పటి 'మారిటోరియం' బిల్లు వారి రైతు పద నిర్వచనం లాగ ప్రతి ప్రాణికిన్నీ వర్తిస్తుంది. ప్రతి మనిషికిన్నీ ఏదో విధమైన సంసారం వుంటుంది. తుట్టతుదకు సన్యాసికూడా సంసారం వుంటుంది ... ఆ యీ సంసారంలో వుండే కష్ట సుఖాలు బాగా అనుభవంలోకి తెచ్చుకొని అన్యాపదేశంగా వ్యక్తీకరించే శక్తి గలవాడే కవి. శబ్దాడంబరం వగయిరాలతో అంత అవసరం లేదు. భావం చక్కగా ఉండడమే కావలసినది. ("కవిత్వంలో నా యెదుగు బొదుగులు").

చెప్పొచ్చేదేమంటే? గ్రంథం రసవత్తర మయిందే అయి ప్రాజ్ఞులోకాన్ని అకర్షించేదే అయితే పది వేల గవర్నమెంట్లు కలిసి దాని ప్రచారాన్ని ఆపలేరనిన్నీ అట్టిది కాకపోయే యెడల దాన్ని వ్యాపింప చేయలేరనిన్నీ నేను నమ్ముతాను. ('శాఖాద్వేషం').

మెప్పించినా మెప్పించకపోయినా, కవి లోకం కోసమే పుట్టడం వల్ల వీలిచ్చినంతలో లోకాన్ని మరువ గూడదు. ('గురుశిష్య ప్రశ్నోత్తరములు').

లోకంలో పుట్టి పెరిగిన కవి లోకాన్ని విడిచి కవిత్వం చెప్పలేడు. ఎక్కడేనా కొన్ని లోకానుభూతులు దొర్లుతూ వుంటాయి. ('మహదైశ్వర్యాభివృద్ధిరస్తు').

కవికి అక్కరకురాని శబ్దం గాని, అర్థంగాని, ప్రపంచకంలో లేనేలేదు. ('మహదైశర్యాభివృద్ధిరస్తు').

నాకేమో పూర్వ కవుల గ్రంథాలలో వుండే వ్రాత పొరపాట్లూ వగైరాలు ప్రమాణాలట! 'బుడబుడక్కల వాళ్ల' మాటలు కూడా ప్రమాణంగా నేను స్వీకరిస్తానుట! నా కవిత్వం గొల్లవాళ్లున్నూ గొడ్ల కాపరులున్నూ మెచ్చుకుంటారుట! ఇవన్నీ నాకు సమ్మతమే. పాపం దీనులు గదా! గొడ్ల కాపరులు. వాళ్లను సంతోష పెట్టిందే పెట్టడం. ('మహదైశ్వర్యాభివృద్ధిరస్తు').

కన్న కొడుకులకు గాని కూతుళ్లకు గాని పెళ్లి చేయకపోయినా అంత విచారం కలగదేమో కాని రచించిన గ్రంథాలు అందులో లోకానికి సత్య నిర్ధారణకై వుపయోగించేవి అచ్చుకాకపోతే కలిగే విచారానికి పారం వుంటుందా? ('నా సంసారానుభవం').

...సంగీతం గాని కవిత్వం గాని జీవితానికి స్వాతంత్ర్యాన్ని కలగించడంలో అందె వేసినవే గాని, వీట్ల వెంట దారిద్ర్యం దీపానికి నీడలాగు ఆశ్రయించడం అనుభూతం ... ("యెందుకీ బాదస్తం").

**కథానిక** బంగ్లాదేశ్

# దృష్టి

అని సుజ్జమాన్

అనువాదం :

వేదాంతం సుబ్రహ్మణ్యం

పాతికేళ్ళు గుమాస్తాగిరి చేసిన తర్వాత కళ్ళకు ఇంకేమి శక్తి ఉంటుంది! అదీకాక, కళ్ళ జబ్బు చాలా రోజుల నుంచి ఉన్నది. అతడు ఏడో క్లాసు చదువు తున్నప్పుడు కళ్ళ జోడు మొట్ట మొదట కొన్నాడు. ఆ రోజు రాత్రి తుఫాను వల్ల కిటికీ గడియ ఊడిపోయి, కిటికీ తలుపు ప్రక్కనున్న టేబులును గట్టిగా కొట్టటం జరిగింది. టేబిలు మీద ఉన్న లావాటి అద్దాల కళ్ళ జోడు క్రిందపడి పోయింది. పడుకునే బల్లకు ఖాన్ రెండు యిటుకలను ఒక్కొక్క కోడు క్రింద పెట్టి ఎత్తు చేశాడు. కళ్ళజోడును దారంతో కట్టి ఉపయోగించు కోవచ్చు, కాని పరిగెత్తుకుంటూ వచ్చిన సాలెహా కాలు దాని మీద పడ్డది.

మరొకటి కొనగలననే ధైర్యం సాదత్‌కు ఉన్నది. కాని, ఎప్పుడన్నదే ప్రశ్న. కారణం, పెన్షను పైకం సరిగ్గా చేతికందటం లేదు. అషాద్‌కు వచ్చే జీతంతో ఏదోవిధంగా కుటుంబ ఖర్చులు వెళ్ళిపోతున్నాయి. సాలెహాకు పెళ్ళి చెయ్యాలి. అయితే, యింతవరకు అది వీలుపడలేదు. అషాద్ పెళ్ళి ఆ మధ్యనే అయింది. కొద్దిరోజుల్లో దేముని దయ వల్ల ఓ పిల్ల పుట్టుంది.

కళ్ళజోడు విరిగి పోవటంతో మహా యిబ్బందిలో పడ్డాడు సాదత్. కళ్లేలేక పోతే మనిషికి యింకేమి ఉండి ఏం లాభం? ఇల్లు వదలి ఎక్కడికి పోవటం లేదు. ఆ యింట్లో వున్న వస్తువులు అస్పష్టంగా అయిపోతే ఇక బ్రతికి ఏం లాభం? మూగవాడు మాట్లాడక పోయినా చూడగలడు గదా — కాని అతడనుకుంటాడు – మళ్ళీ మళ్ళీ అనుకుంటాడు – కళ్ళతో చూసినంత మాత్రాన ఏమవుతుంది, నోటి నుండి ఒక్క మాట గూడ లేక పోయిన తర్వాత? ఆలోచనలను ప్రక్కకు నెట్టి సాదత్ కేక పెట్టాడు, "సాలెహా ఒక్క పాన్ యిచ్చిపో అమ్మా."

ఆకులు పుచ్చుకుని వచ్చింది హసీనా — అషాద్ భార్య. "ఇదండి" అనగానే గుర్తు పట్టాడు సాదత్. అన్నాడు, "సాలెహా ఎక్కడ ?" అని.

"ఇంట్లో ఉంది."

"ఆమెకిచ్చి పంపక పోయావా? సువ్విక ఎక్కువ తిరక్కూడదు."

ఆప్యాయతతో కూడిన యీ అభియోగాన్ని వినగానే హసీనా నవ్వింది. చాలా మంచి మనిషి తన మామగారు. ఈ మాటల్లోని ఆతని ప్రేమాభినాలను ఆమె అర్ధంచేసుకున్నది. మాట మారుస్తూ "కళ్ళజోడు కొనుక్కుంటే సరిపోయేది కదా. ఇంట్లో కొంత డబ్బుంది. తక్కినది అప్పుతీసుకుంటే, వచ్చే నెలలో తీర్చ వచ్చుగా" అన్నది. సాదత్ నవ్వుతూ, ఇప్పుడు మన యింట్లో డబ్బు ఉంచు కోవటం అవసరం. పాత వాళ్ళకంద రకూ యింత వరకూ సేవ చేశావు, యిప్పుడు క్రొత్త ప్రాణి సంగతి చూసు కోవాలె," అన్నాడు. హసీనా వెళ్లి పోయింది.

పరిగెత్తు కుంటూ వచ్చి సాలెహా అన్నది "ఏమైందో తెలుసునాండి?"

"ఏమైంది?"

"మెడికల్ హాస్టల్లో రాష్ట్ర భాష* కొరకు పట్టు పట్టి విద్యార్థులు గొడవ చేశారు. పోలీసులు కాల్పులు ఆరంభించారు."

"కాల్పులా?" సాదత్ కంఠస్వరం అపనమ్మకాన్ని సూచిస్తున్నది.

"ఆఁ. గ్యాసు వదిలి, లాఠీలతో కొట్టి, అరెస్టు చేసి నప్పటికీ, ఏం లాభం లేక పోయింది. దాంతో తుపాకులతో కాల్చారు. ఆరుగురు చచ్చిపోయారు."

"ఆరుగురా?"

"ఆరుగురు చచ్చిపోయారు, చాలా మందికి దెబ్బలు తగిలినయి."

"నీకెవరు చెప్పారు?"

"మన బచ్చా. వాడింత వరకు అక్కడే ఉన్నాడు. తుపాకులు కాలుస్తుంటే, వచ్చేశాడు."

"ఆశ్చర్యం!" అప్పటికి సాదత్ తన పూర్తి చైతన్యాన్ని తిరిగి పొందగలిగాడు. ఇంత కంటె చెడు బ్రిటిషు హయాంలో ఎక్కండుంది? ఈ కొద్ది సంవత్సరాలలో అంతకు తక్కువ ప్రదేశాల్లో మాత్రమే కాల్పులు జరగలేదే?

"మేము మూగవాళ్ళలా పడి ఉండాలా ఏం?" సాలెహా కంఠ స్వరం కోపంతో వణికింది. ఆమె అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

నిశ్శబ్దంగా ఉన్న సాదత్ హృదయం ఆలోచనలతో నిండి పోయింది. ఈ ప్రపంచం మనుష్యు లుండటానికి నిరుపయోగమయింది. యింకా యిలాటి వెన్నో ఆలోచనల్ల మధ్య ఆషాద్ అక్కడి కొచ్చాడు. అతనిని మళ్ళీ అడిగాడు:

"నిజంగా ఆరుగురు చచ్చి పోయారా?"

"ఆఁ." ఆషాద్ జవాబిచ్చాడు.

వృద్ధుడు తన ఆలోచనలతో మళ్ళీ మునిగిపోయాడు.

నిద్రనుండి లేవగానే సాదత్ ఆషద్‌ను గురించి అడిగాడు. "ఆఫీసుకె ళ్ళారు" అన్నది హసీనా.

"ఇంత త్వరగానా?"

"త్వరగా ఏమిటి? ఇవాళ శుక్రవారం, త్వరగానేగా ఆఫీసు!"

నిజమే. ఇందులో త్వర ఏముంది? ఆయన లేవడం ఆలస్యమైంది. గడిచిన రాత్రి తుపాకులతో వీధులు గస్తీ తిరుగతున్న సిపాయిాల కాళ్ళ చప్పుడు వింటూ చాలా సేపు మేలుకుని ఉన్నాడు.

టీ తీసుకొచ్చి సాలెహా అన్నది: "అన్నయ్య వాళ్ల ఆఫీసులో యివాళ బహుశా హర్తాల్‌గా జరగవచ్చు. వీలైనంత వరకు చూస్తానన్నాడు అన్నయ్య. కాని, అన్నయ్య వాళ్ళ ఉద్యోగాలు ఒకవేళ పోతేనో, నాన్నా?" ఆశగా కబుర్లు చెప్పాలనుకుని ఎంత ప్రయత్నించినా, ఏమీ ఉత్సాహం లేకుండా పోతున్నది.

సాదత్ ఏదో ఆలోచిస్తూ "పోదు, ఉద్యోగం పోదు", అన్నాడు పరధ్యానంగా. అయినా, ఈ ఆలోచనలకే అతని మనస్సు మళ్ళింది. మనుష్యుని ఆలోచనలకు అంతం ఎక్కడ?

వీధులన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి. బళ్ళ చప్పుడు గాని, గుర్రాల అలజడి గాని, విన్పించటం లేదు. ఇవాళ అంతా

* తమ మాతృ భాష బెంగాలీని అణగదొక్కి ఉర్దూను తమపై రుద్దడానికి పాకిస్తాని నిరంకుశ ప్రభుత్వ చర్యలకు ప్రతిఘటన.

మూసేశారు. నలుగురి కంటే ఎక్కువ మంది తిరగటం లేదు. అందరు మృత్యువు మాదిరే నిశ్శబ్దంగాఉన్నారు. కాని, మృత్యువు వలె శాంతంగా లేరు. పట్నమంతా ఏదో అణిచి వేయబడ్డ ఉత్తేజంతో వణికిపోతున్నది.

మృత్యువు అనే మాట మనసులో మెలగగానే, ముసలాయనకు తన అవసాన కాలాన్ని గూర్చిన ఆలోచన వచ్చింది. తాను చనిపోయిం తర్వాత, ఎవరుంటారు? ఒకవేళ అషాద్ కూడా పోతాడేమో. అప్పుడింకెవరుంటారు? అషాద్ పిల్లలా? తనకు తనే సమాధాన పర్చుకున్నాడు. కొంత వరకు మనస్సు కుదుట పర్చుకున్నాడు గూడా. రాబొయ్యే ఉత్తరాధికార్లను గురించి ఆలోచిస్తూ కాస్త ధైర్యం తెచ్చుకున్నాడు. సజీవమైన రక్తపు ఉష్ణోగ్రత వల, ఆశతో నిండిన వృద్ధుని హృదయమూ కొంతవరకు వేడిపడ్డది.

ఎవరో తలుపు గడియ శబ్దం చేస్తున్నారు. సాలెహాను పిల్చి ఎవరొచ్చారో చూడమన్నాడు. తలుపు తీసిన చప్పుడయింది. సాలెహా అడుగుతున్నది, "హాలిం అన్నయ్యా, ఏం సంగతులు?"

సమాధానం అతనికి వినిపించలేదు. హాలిం అనే అబ్బాయి అషాద్‌తో కలిసి పనిచేస్తాడు. దగ్గర్లోనే ఉంటాడు. ఏమిటి విషయం?

కొన్ని కాళ్ళ చప్పుళ్లు వినబడు తున్నాయి ప్రక్కగది లోంచి. హాసీనా, సాలెహా ఒక్కసారి గొల్లుమన్నారు. సాదత్ అడిగాడు: "ఏమైంది సాలెహా, హాసీనా?" కొయ్య మంచం మీదినుంచి దిగి కర్ర చడావులు తొడుక్కున్నాడు. కళ్లజోడు లేదు, ముందుకు అడుగు వెయ్య లేకుండా ఉన్నాడు. సాలెహాయే ఆ గదిలోకి వచ్చింది. ఏడుస్తూ, ఏడుస్తూ అన్నది: "అన్నయ్యకు గుండు తగిలింది – చచ్చిపోయినాడు. 'అటు తర్వాత వెక్కి వెక్కి ఏడుస్తున్న హాలిం గొంతు వినిపించింది: "ఆఫీసులో స్ట్రైకు చేసి ఊరేగింపు బైలుదేరింది. పోలీసులు తుపాకులు కాల్చారు. వెంటనే గుండు తగిలి చచ్చిపోయాడతను. ఆసుపత్రికి తీసికెళ్ళితే శవాన్ని గూడా యివ్వరేమో అని డాక్టరు వద్దకు తీసుకెళ్ళాము. అక్కడ్నుంచి యిక్కడికి తెచ్చాము."

సాలెహా, సాదత్‌ను పట్టుకొని ఆ గదిలోకి తీసుకొచ్చింది. ఆమె ఆగకుండా విలపిస్తున్నది. హాసీనా మృతదేహం మీద పడి రోదిస్తున్నది.

ఆమె గర్భం లోని శిశువు హఠాత్తుగా కదిలినట్లున్నది.

సాదత్ యింత వరకు ఏడుస్తూనే ఉన్నాడు. మృతదేహాన్ని తన చేతులతో నిమురుతున్నాడు. చూడాలని శాయశక్తులా పాటుపడుతున్నాడు. "నాకేమీ కనపడటం లేదు. అషాద్, ఎక్కడ ఉన్నావురా? నేనేమి చూడ లేకుండా ఉన్నాను." కాని, దృష్టి మరింత మందగిస్తున్నది – అస్పష్టత హెచ్చు తున్నది. ఈ అస్పష్టత యింక ఎప్పటికీ దూరం కాదు, యింక ఎప్పటికీ చూడటానికి వీలుపడదు అనిపిస్తున్నది. ఎప్పటికీనా? హాసీనా శిశువును గూడ చూడటం పడదా?

హాసీనాకు పుట్టబోయే పాప రూపు రేఖలు మనస్సులో చిత్రాన్ని గీస్తు న్నాయి. ఎలాగైనా చూద్దామని ప్రాణం తహతహ లాడుతున్నది. ఏడుపు క్షీణిస్తున్నది మెల్ల మెల్లగా.

# జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్ రంగస్థలంపై 'వసంతసేన', 'ముద్రారాక్షసం' ప్రదర్శన

కొట్రుగడ్డ గంగయ్య

ప్రపంచ ప్రసిద్ధ సంస్కృత నాటకం 'మృచ్ఛకటికం' జర్మన్ ప్రజా స్వామిక రిపబ్లిక్ (జి. డి. ఆర్.) రాజధాని బెర్లిన్ నగరంలో, జర్మన్ భాషలో తొలిసారిగా సంగీత నాటకంగా సెప్టెంబరు 8 వ తేదీనాడు ప్రదర్శింపబడింది. నటీ నటులంతా ఆ దేశపు ప్రఖ్యాత కళాకారులు.

రెండు వేల సంవత్సరాల క్రితం శూద్రకుడన్న రాజు పైని, ఆ నిరంకు పాలకుని పైని ప్రజలు తిరుగుబాటు చేసి పదవీ భ్రష్టుని చేయడం, 'వసంతసేన అన్న పేరుతో రచింపబడిన యీ నాటక యితివృత్తం. దీని యింకో విశిష్ట నాయకి (వసంతసేన) వేశ్యగా జన్మించిన సద్గుణ సంపన్నురాలు, నాయకుడ సద్బ్రాహ్మణుడు.

యూరోపియన్ రంగస్థల ప్రదర్శన కనువుగా ప్రముఖ జర్మన్ ప్రజా స్వామిక రిపబ్లిక్ రచయిత లియోన్ ఫాయిఖ్ట్వాంగర్ రచన ఆధారంగా పీటర్ ఎన్సికాట్ దీనిని సంగీత నాటకంగా రూపొందించారు. ఆ దేశంలోనే గాక వి శాలలోనూ ప్రఖ్యాతుడైన గీడో మసానెత్స్ దానికి స్వరకల్పన చేశారు.

ఆయనను, ఆయన సతీమణిని గత సంవత్సరం జూన్ నెలలో వారి యిం వద్ద కలుసుకునే అవకాశం భారత — జి. డి. ఆర్. మిత్ర మండలి అధ్యక్షురాల శ్రీమతి సుభద్ర జోషికి, నాకూ కలిగింది.

వారి యిల్లు మన దేశపు చిత్రాలలోనూ, సామగ్రితోనూ, సంగీత సా నాలు, సంగీతపు రికార్డులు, టేపులతోనూ నిండి వుంది. పియానో లేక పోం నట్టయితే, అది ఎవరో భారతీయ కళాకారుని యిల్లేమో అనిపించేటట్టుగా వుంది

“నా జీవితంలో ఎంతో ప్రాముఖ్యం గల దశలో నేను ప్రవేశిస్తున్నాను కొన్ని సంవత్సరాలుగా చేస్తున్న ప్రత్యేక కృషి ఒక రూపానికి వస్తోంది మీ 'వసంతసేన' ను మా ప్రజలకు పరిచయం చేసే మహదవకాశం నాక లభించింది. ఈ నాటకానికి నేను చేసిన స్వరకల్పనను మీకు వినిపిస్తాను. వీ అభిప్రాయం నిర్మొహమాటంగా చెప్పండి” అంటూ ఎంతో ఉత్సాహంతోనూ ఉద్రేకంతోనూ ఆ సంగీత వేత్త మమ్మల్ని కోరారు. అలా చెపుతూ ఆయన పియానో వద్ద కూచొని కొన్ని భాగాలు వినిపించారు.

అది వింటున్నప్పుడు మా కెంతో ఆనందమే కాకుండా, ఆశ్చర్యం కూడ కలిగింది. ఆ సంగీతంలో మన రాగాలు, పాశ్చాత్య జానపద సంగీత శైలులలో సమ్మిళితమై వున్నాయి. శాస్త్రీయ సంగీత పరిజ్ఞానం లేని సామాన్య శ్రోతలుగ మేము మా అభిప్రాయాలను ఆయనకు చెప్పాము. ఆ సంగీతాన్ని ఆనందించామనీ

భారతీయ సంగీతాన్ని కొంత వరకైనా అది జర్మన్ ప్రజలకు తప్పక పరిచయం చేస్తుందని తెలిపాను. అక్కడికి మాతో వచ్చిన జర్మన్ మిత్రులు (భారత దేశంతో బాగా పరిచయం వున్నవారు) కూడా మాతో ఏకీభవించారు.

మణిపూర్‌కు చెందిన సోనార్‌చంద్ అన్న భారతీయ కళాకారుడు ఈ నాటకానికి నృత్య దర్శకుడు. ఆయన నటులకు భారతీయ నృత్య శిక్షణ యిచ్చారు.

భారత, జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్కుల కళాకారుల ఆదాన ప్రదానాలకు ఉదాహరణ 'వసంతసేన' ఒక్కటే కాదు. రెండు సంవత్సరాల క్రితం, యింకో ప్రసిద్ధ సంస్కృత నాటకమైన ముద్రారాక్షసాన్ని ఆ దేశ కళాకారులు వచన నాటకంగా ప్రదర్శించారు. అది యిప్పటికీ ప్రదర్శింప బడుతూనే వుంది. ఇది కూడా భారత, జి. డి. ఆర్. కళాకారుల సమిష్టి కృషి ఫలితంగా రూపొందినదే. గత సంవత్సరం జూన్ నెలలో వైమార్ నగరంలో యీ నాటక ప్రదర్శనను చూసి ఆనందించే అవకాశం నాకు లభించింది. కిక్కిరిసి పోయిన ప్రేక్షకాగారం కరతాళ ధ్వనులతో పదే పదే ప్రతిధ్వనించింది. విరామ సమయంలో ప్రేక్షకులు నా వద్దకు వచ్చి, ఆ నాటకాన్ని ప్రశంసించేరు.

ముద్రారాక్షసాన్ని జి. డి. ఆర్. నటులు తమ దేశంలోనే కాక, స్విట్జర్లండ్‌లోనూ ప్రదర్శించారు. యూరప్‌లోని యితర దేశాలను నుండి కూడా వారికి ఆహ్వానాలు వస్తున్నాయట.

## చీకటి ఎక్కడుంది? . . . జయంపు కృష్ణ

చీకటికి
చిక్కు తీయాలనీ,
కూకటి వేళ్ళతో
పెళ్ళగించాలనీ,
వెలుగులను మలుపు తిప్పి
మొలిపించాలనీ,
గట్టి ఉక్కు గోళ్ళు
పెంచాను -
దిగంతాల అంచుల్లో
పొంచాను -
కానీ, ఏదీ ???
చీకటి కనిపించదే!
ఓహ్ .........
చీకటి నా గుండెల్లో వుంది!

## జాతీయ జాతి . . . ప్రేమ్‌శిల

స్పృహలేని జాతీయ — జాతి
పతాకాన్ని మొలకు చుట్టుకుని
గీతాన్ని మూర్ఛమెడకు తగిలించుకుని
మృగాన్ని నెత్తిమీద ఎక్కించుకుని
పక్షి రెక్కలు పట్టుకుని ఎగిరిపోయి
అల్లిబిల్లి లోకంలో
కల్లబొల్లి కబుర్లతో
హరికథలు వింటూ
వళ్ళు తెలియక చప్పట్లు కొడుతోంది
భజనల్లో కళ్ళు తేలేస్తోంది
శ్రమ ఫలం కాకి ముక్కులకి అందిస్తూ
కాల - సర్పాన్ని కావలించుకుంటోంది
అందమైన పువ్వులాంటి జాతి
విషనాలికల ఋసలకి వాడి
కాటు కాటుకి రేక్కలూడి
నేల రాలిపోతోంది.

# మలయాళ సినిమా పరిశ్రమను కొత్త బాట తొక్కిస్తున్న సంస్థ

## చిత్రలేఖ

మలయాళ సినిమా రంగంలోని ప్రగతిశీలురూ, ఉత్సాహ వంతులూ ఐన యువ కళాకారులూ, సాంకేతిక నిపుణులూ కొందరు 13 సంవత్సరాల క్రితం "చిత్రలేఖ" పేరిట ప్రారంభించిన ఒక సహకార సంస్థ, ఒక ఉద్యమ రూపం ధరించి, దారీ తెన్నూ లేని భారతీయ చలన చిత్ర పరిశ్రమను చూచి నిస్పృహ చెందే కళాభిమానులకు ఒక ఆశా కిరణం చూపుతున్నది. కొద్దిమంది ఆదర్శవాదులు కృషిలో ఆరంభమైన ఈ చిన్న సహకార సంస్థ యిప్పటి కప్పుడే మలయాళ సినిమా రంగంలో ఒక గణనీయమైన భాగాన్ని ఒక కొత్త పుంతలోకి మళ్లించింది; కొన్ని మంచి చిత్రాలు నిర్మించింది; ప్రేక్షకుల అభిరుచుల్లో మార్పు తెచ్చింది; ఫార్ములాలనూ, తారాబలాల్నీ తారుమారు చేసింది. జాతీయ స్థాయిలోనూ, అంతర్జాతీయ స్థాయిలోనూ కూడా మన్నన సంపాదించి, సినిమాను ఒక వ్యాపారంగా మాత్రమే గాక, సామాజిక ప్రయోజనం సాధించగల ఒక కళగా కూడా నిర్వహించ వచ్చని మాటల్లో గాక, చేతల్లో నిరూపించింది.

పూనాలోని ఫిల్మ్ అండ్ టెలివిజన్ యిన్‌స్టిట్యూట్ ప్రారంభించిన కోర్సులో మొదటి జట్టులో శిక్షణ పొందుతున్న రోజుల్లోనే, కొందరు కేరళ విద్యార్థులకు యిటువంటి సంస్థను స్థాపించాలన్న ఆలోచన వచ్చింది. ఇటీవల "స్వయంవరం", "కొడియెట్టం" వంటి ఉత్తమ చిత్రాలను నిర్మించిన అదూర్ గోపాల కృష్ణన్ (అప్పుడీయన పూనా యిన్‌స్టిట్యూట్‌లో డైరక్షన్ విభాగంలో శిక్షణ పొందుతున్నారు), బొంబాయిలో జర్నలింజంలో శిక్షణ పొందుతున్న చలనచిత్ర కళాభిమాని శ్రీ భాస్కరన్ నాయర్ కలిసి, తమ తోటి విద్యార్థులలో మొలకెత్తిన ఈ సహకార ఉద్యమభావానికి రూపకల్పన చేశారు.

వీరు మరికొందరు మిత్రులను సంప్రతించి, తాము తలపెట్టిన ఉద్యమానికి ఒక ప్రణాళిక లాంటిది తయారు చేశారు. ప్రజల్లో సినిమా కళ గురించిన ప్రచారానికి ఉపయోగ పడే సాహిత్యాన్ని ప్రచురించటం; ప్రేక్షక సంఘాలను ఏర్పరచి వాటిని ఒక ఉద్యమంగా, అభివృద్ధి పరచటం ద్వారా, ప్రేక్షకుల్లో సవ్యమైన అభిరుచులను పెంపొందించటం; కళాత్మకమైన చిత్రాల నిర్మాణం, పంపిణి — ఇవీ వారు ఈ ప్రణాళికలో తమ ఉద్యమానికి పెట్టుకున్న మూడు కర్తవ్యాలు.

ఆ తరువాత వీరు చిత్రలేఖ అనే ఒక ఫిలిం సావెనీర్‌ను, కొంత సాహిత్యాన్ని ప్రచురించి తమ భావి కృషికి రంగాన్ని సిద్ధం చేసుకొన్నారు. 1965లో, వారు తిరువనంతపురంలో ప్రారంభించిన "చిత్రలేఖ ఫిలిం సొసైటీ" కల్పించిన ఉత్తేజంతో యిప్పుడు కేరళ నలుమూలలా దాదాపు 30 ఫిలిం సొసైటీలు యేర్పడి ఈ ఉద

మాన్ని ముందుకు తీసుకు పోతున్నవి.

ఈ చిత్రలేఖ సహకార సంస్థ యిప్పటికి మలయాళంలో దాదాపు 24 డాక్యుమెంటరీలు, హ్రస్వ చిత్రాలు, రెండు కథా చిత్రాలు నిర్మించింది.

మంచి చిత్రాలు నిర్మించటంతోనే సరిపోదు కదా, వాటిని జనానికి చూపాలి కదా, కేవలం వ్యాపార దృష్టితో పనిచేసే డిస్ట్రిబ్యూటింగ్ సంస్థలు యిలాంటి చిత్రాలను మూ చూడనైనా చూడవు కదా. అందుకని చిత్రలేఖ నిర్వాహకులు ఈ విషయాన్ని మనసులో పెట్టుకొని, ముందే తమ సొంత పంపిణీ యంత్రాన్ని ఏర్పాటు చేసుకొన్నారు.

1972లో శ్రీ అదూరి గోపాల కృష్ణన్, ఫిలిమ్ ఫైనాన్స్ కార్పొరేషన్ సహాయంతో "స్వయంవరం" అన్న చిత్రాన్ని నిర్మించారు. ప్రయివేటు డిస్ట్రిబ్యూటర్లు సహజంగానే సహాయ నిరాకరణ చేశారు. అప్పుడు చిత్రలేఖ పంపిణీ సంస్థ దాన్ని జయప్రదంగా ప్రదర్శించింది. పెట్టిన పెట్టుబడి పోగా, తగు మాత్రం లాభం కూడా వచ్చింది. ఈ చిత్రానికి రాష్ట్రపతి స్వర్ణపతకమూ, ఉత్తమ దర్శకునికీ, ఉత్తమ నటునికీ యిచ్చే బహుమతులు కూడా లభించాయి. ఈ చిత్రం 1973 లో మాస్కోలో జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలోనూ, అనేక పై దేశాల్లోనూ ప్రదర్శించబడి సర్వత్రా ఎంతో మన్నన పొందింది.

చిత్రలేఖ అధ్వర్యాన నిర్మించబడిన రెండవ కథా చిత్రం "కొడియెట్టం", దీని స్క్రిప్టూ, దర్శకత్వమూ శ్రీ గోపాల కృష్ణన్‌వే. చిత్రలేఖ సంస్థ తన మొదటి చిత్రం పెట్టుబడి ఫిలిం ఫైనాన్స్ కార్పొరేషన్‌పై ఆధారపడగా, ఈ చిత్రాన్ని పూర్తిగా తన సొంత పెట్టుబడితోనే నిర్మించగలిగింది. 1977 లో నిర్మించబడిన ఈ చిత్రాన్ని ఈ సంవత్సరం జనవరిలో మద్రాసులో జరిగిన "ఫిల్మోత్సవ్" లో ప్రదర్శించారు.

చిత్ర నిర్మాణానికి కావలసిన యంత్ర సామగ్రి అంతా యిప్పుడు చిత్రలేఖకు వుంది. దాని కిప్పుడు 4 కెమెరా యూనిట్లతోసహా ఔట్‌డోర్ షూటింగ్‌కు కావలసిన సాధనాలన్నీ వున్నాయి. మూడు ఎడిటింగ్ యంత్రాలు, అనుబంధ సాధనాలూ వున్నాయి. అది యిప్పుడు వీటిని, తనకు పనిలేనప్పుడు యితర నిర్మాతలకు అద్దెకిస్తూ వుంది కూడా.

ఈ సంస్థ యిప్పుడు రు. 50 లక్షల పెట్టుబడితో తిరువనంతపురంలో తన సొంత స్టూడియోను నిర్మించు కొంటున్నది. 20 ఎకరాల స్థలంలో నిర్మిస్తున్న ఈ స్టూడియోలో బ్లాక్ అండ్ వైట్ లెబొరాటరీ, ఒక ఎడిటింగ్ విభాగం, ప్రివ్యూ థియేటర్, ఒక పెద్ద గ్రంథాలయం, ఒక ఆడిటోరియం, ఒక అతిథి గృహం మొదలయినవి వుంటాయి.

ఫిలిమ్ వ్యాపారానికి అతి ముఖ్యమైన ఎగ్జిబిషన్ విషయం కూడా ఈ సంస్థ నిర్వాహకులు శ్రద్ధ వహిస్తున్నారు. రాష్ట్ర మంతటా అన్ని జిల్లా ముఖ్య పట్టణాల్లోనూ ఒక్కొక్కటి చొప్పున థియేటర్లు నిర్మించాలని వీరు సంకల్పించారు. వీటిలో చిత్రలేఖ సొంత చిత్రాలనే గాక యితర భారతీయ భాషల, విదేశీ భాషల ఉత్తమ చిత్రాలను కూడా ప్రదర్శిస్తారు.

ఉత్తమ చిత్రాలను నిర్మించాలని

ఉత్సాహంతో ముందు కొచ్చే చిత్ర నిర్మాతలకు, వారికి సొంత ఆర్థిక వనరులు లేనప్పుడు, తన నిర్మాణ సదుపాయాలను వారికి అరువిచ్చి తోడ్పడే ఒక పథకం కూడా ఈ సంస్థకుంది.

చిత్రలేఖ కేవలం లాభాలకోసం పని చేస్తున్న సంస్థ కాదు. అందుకనే దాని నిబంధనావళిలో, వాటాదారులకు పంచే లాభం ఏడున్నర శాతానికి మించదు.

సెట్ల బరువుతో, ఫార్ములాల సంకెళ్లతో, ఆర్భాటపు ఖర్చులతో, అర్థం పర్థం లేని అనుకరణలతో, అన్నిటికన్న ముఖ్యంగా తారాధారంతో కుంగిపోతూ, రాసి తప్ప వాసి అంతగా కనిపించని మన తెలుగు చలన చిత్ర పరిశ్రమలో పనిచేస్తున్న వారు (ఈ పరిశ్రమ ఈ దుస్థితిలో నుంచి బైట పడాలని నిజంగా కోరుకొనే వారు), మళయాల చిత్ర పరిశ్రమ ప్రయోగాన్ని తప్పక పరిశీలించ వలసివుంది.

(మలయాళం లిటరరీ సర్వే, 1978 ఏప్రిల్ – జూన్ సంచిక ఆధారంగా "విశ్వమిత్ర".)

## వెలుగుకోసం వీటి తపసు

. . . దేవరాజు మహారాజు

అవునూ — ?
ఇంత ప్రకృతిలో వింతగా
చెట్లు మాత్రమే నిలుచొనున్నాయ్?
సూటు మనిషో బొచ్చుకుక్కో కావు
కాదా అని
కొర్లమీదఎండిన డొక్కలసజీవపురోడ్డు,
వెన్నుపూస మీద మైళ్ళ బొమికల్ని
లెక్కిస్తూ దాటి
రమ్యం అనుకుంటున్న గమ్యం
అగమ్యం చేరడానికి —
మత్తువి త్రాగడానికి ఖరీదైన
బిస్కత్తులు తినడానికి –
కండల్లో గుచ్చుకు వెళ్ళిన రక్తనాళాల్లా
కాళ్ళను ధరిత్రిలోకి జొప్పించి,
కొమ్మల చేతుల్ని పైకెత్తి
సూర్య నమస్కారాలు చేస్తూ
పుట్టుక నుండి గిట్టేదాక
మొదలు నుండి చిట్టచివరి దాకా
నిటారుగా హుషారుగా
నిలుచుండే తపస్సు చేస్తున్న
మహామునులు - ఈ చెట్లు,
వెలుగు కోసం వీటి తపసు

విషపు బొగ్గుపులుసు గాలులు పీలుస్తూ
ప్రాణవాయులు ;
తమ ప్రాణాలు, శరీరపు కణాలు సర్వం
ప్రాణులకందిస్తున్న త్యాగులు —
ఈ చెట్లు.

గాలి ఎండ వాన .... బెడసి కొడితే,
జడిసిపోయే మనుషుల్లాంటి పులుగుల్లా.
సూటిగా సూర్యుణ్ణి చూసే ధైర్యం లేక
చీకటినే వెలుగనుకునే
పులుగుల్లాంటి మనుషుల్లా ....
పిరికితనం పీలుస్తూ
పనికిరాని ఛాతీలు పెంచుకుని
బ్రతకాల్సిన ఖర్మేమిటి ఈ చెట్లకు ?

వాతావరణంతో రణమొస్తే సైతం
కలెబడతాయి —
పచ్చగా తలూపుతూ
చైతన్యానికి సంకేతంలా
నిలబడతాయి -

ఈ వృక్షాలకు మనుషుల్లా
తాము పడుతూ కడుకొద్దీ యితర్ల ఇళ్ళు
పడగొడదామన్న ప్రసక్తే లేదు.
తాము నిలబడుతూ నలుగురి యిళ్ళ

# అబ్బే! ఏంలేదు ఇది కథ

(ఏ మోడర్న్ లిటిల్ స్టోరీ)

కె. చిరంజీవి

సత్య మూర్తి వీధిన వెడుతున్నాడు. ఆ వీధి హైదరాబాదు నగరంలోది. హైదరాబాదంటే తెలుసుగా? ఆంధ్ర ప్రదేశ్ రాజధాని నగరం. ఇక్కడే ఆంధ్ర, తెలంగాణా 'విప్లవాలు' చెల రేగాయి. మొన్నటి దాకావున్న ముఖ్య మంత్రి ఇప్పుడు కిమ్మన కుండా అసెంబ్లీలో కూర్చున్నాడు. ప్రస్తుతానికి డాక్టర్ చెన్నారెడ్డి నగరానికి – కాదు సుమా కల – ఈ రాష్ట్రాని కంతకూ ముఖ్యమంత్రి.

కళ్లకు గంతలు కట్టు కున్నట్లు నల్లకళ్లజోడు ధరించి నడుస్తున్నాడు సత్యమూర్తి. వీధిలో ఎండ లేదు. నల్ల కళ్లద్దాలు మూర్తి ముఖాన వున్నాయి. వాటిని ప్రదర్శించాలని వాని అభిమతం.

అయినా ఈ కళ్లద్దాల వల్ల కొన్ని ప్రయోజనాలున్నాయి. అందమైన అమ్మాయిలను చూడనట్టే చూడవచ్చు. అందమైన ఆ వంపులను ఆ వంపులలోని సరళ లలిత సుగమ స్వాదు సంగీతా లను చూడవచ్చు. మరీ చిన్నపిల్లలంటే సత్యమూర్తికి యిష్టం.

ఆ మాట కొస్తే సత్యమూర్తికి యిష్ట మైనవి చాలా వున్నాయి. గురుజాడ వారి కన్యాశుల్కమంటే యిష్టం. కన్యాశుల్కంలోని మధురవాణి, బుచ్చమ్మలంటే మరీమరీ యిష్టం. వెంకటేశ మన్నా ఇష్టమే. వెంకటేశానికి యిష్ట మైన గడ్డ పెరుగు, జామిపండ్లు మహా యిష్టం.

సత్యమూర్తి నడుస్తూన్నాడు. అటు షాపులు, ఇటు షాపులు. షాపులకు దిగువ మెట్లులాగా ఫుట్‌పాత్. ఆ దిగువ సర్వం జగన్నాధానికి మల్లె అవులించు కునివున్న సిమెంటు రోడ్డు. సిమెంటు రోడ్డయినా అక్కడక్కడా సొట్టలు పడిపోయి వుంది. ఆ సొట్టలను చూసి నప్పుడు 'చిన్నారి' సొట్టబుగ్గలు గుర్తు కొస్తాయి సత్య మూర్తికి. ఆ గుంటలలో పడి ఎంతమంది స్కూటర్లవాళ్లు తమ కాళ్లుచేతులు విరిచేసుకున్నారో? 'భగ్న ప్రేమికులు' జ్ఞాపకంవచ్చి సత్యసాయి బాబాలా నవ్వుకున్నాడు సత్యమూర్తి.

ఇంతలో పది పన్నెండేళ్ల కుర్రాడు ఒకడొచ్చి మూర్తిని ఢీకొన్నాడు. సత్య మూర్తిని ఢీకొన్న సైకిలు పక్కకు పడింది. కుర్రాడు వెల్లికిలా పడ్డాడు.

సత్యమూర్తికి కోపం రాకపోగా, పైపెచ్చు, దయకలిగింది ఆ కుర్రాడి మైన ఒక్క క్షణం.

పడిపోయిన కుర్రాణ్ణి పైకి లేపాడు. ఆ కుర్రాడి నోటినుంచి ఒకేఒక మాట కలవరింతలా వినిపిస్తున్నది. – రజో లిక, రజోలిక, రజోలిక అని.

ఏమిటో? ఆ మాటకు అర్థమేమిటో ఏ భాషా నిఘంటువులోనూ లేదు.

అర్థం కాలేదు సత్యమూర్తికి.

(ప్రేరణ: ఈనాడొస్తోన్న కొన్ని అత్యాధునిక కథానికలు.)

అలోచనలు నరికి ముక్కలు ముక్కలు చేసినట్లుండవు. అలాగని అవి ఒక దానికొకటి అనుసంధించీ వుండవు... అందుకే దానిని ఆలోచనా స్రవంతి అనో, చైతన్య స్రవంతి అనో, లేదా మనోగత జీవనప్రవాహమనో అందాం.

# గాథా సప్తశతి
# పరిశీలనపై భిన్నాభిప్రాయం

**శ్రీమతి పి. సంజీవమ్మ**

'గాథాసప్తశతి' లో కొన్ని గాధలు ఆధారంగా శాతవాహనుల కాలం నాటి సామాజిక పరిస్థితుల్ని కొంత అంచనా వేశారు కంభంపాటి సత్యనారాయణగారు (అభ్యుదయ - ఆగస్టు, సెప్టెంబరు '78 సంచికలు). సామాజిక దృక్పథంతో ఆ గ్రంధాన్ని పరిశీలించ ప్రయత్నించటం సరియైనది; వారి కృషి ప్రశంసనీయమైనది. ప్రత్యేకంగా సామాజిక స్పృహతో రచన చేయటం సాధారణంగ ఆధునిక సాహిత్య యుగంలోనే జరుగుతూవున్నా, ప్రాచీన గ్రంథాలు ఆధారంగా ఆనాటి సామాజిక పరిస్థితుల్ని కొంతవరకు అంచనా వేయటం సాధ్యమే. అలాంటి గ్రంథాల్లో "గాథాసప్తశతి" చాల ప్రశస్తమైంది. ఇందులో మనోజ్ఞమైన కవితా కళ వుట్టిపడటమే కాదు, ఒక్కొక్క గాథలోనూ ఆనాటి జీవితం వివిధ కోణాల్లో ప్రతిబింబిస్తూ వుండటం వాని విశిష్టత, ప్రత్యేకత. అందులో వాడబడిన అలంకారాలకు ప్రాతిపదిక ఎక్కువగ సామాజిక జీవితమే. అయితే శృంగారం ఎక్కువ గాథల్లో ప్రధానాంశంగ కనిపిస్తుంది.

ఈ గ్రంథాన్ని సామాజిక దృక్పథంతో మరింత లోతుగ పరిశీలించి వ్యాఖ్యానించటం అవసరం. సత్యనారాయణ గారి ప్రయత్నం బావుంది. ఒక దృక్పథంతో ఆ గాథల్ని పరిశీలించి, విషయ సామ్యం వున్న గాథల్ని యెన్నుకొని కూర్చి, వాఖ్యానిస్తూ పోయారు. అయితే అక్కడక్కడ వ్యాఖ్యానాల్లో కవి వుద్దేశించిన భావాన్ని బట్టికాక, తమ దృక్పథానికి అనుగుణంగా విషయాన్ని లాగినారు అనిపించి, ఈ నాలుగు ముక్కలూ వ్రాస్తున్నాను.

ఈశ్వరుడనే కవి గాథని (పుట 71; 1: 285) సత్యనారాయణ గారు "ప్రియుడు పేదవాడైతే ప్రేయసి పట్ల ధనికుని లాగే ప్రవరిస్తాడంటాడు" అని వ్యాఖ్యానించారు. కవి వుద్దేశించిన భావానికి సంబంధం లేకుండా ఈ వ్యాఖ్యానం చేయబడింది. ప్రియురాలు వశమై వున్నట్లయితే పేదవాడు కూడ తనను ధనికుడిగ భావించు కుంటాడు, అలా కాక ప్రియురాలు లేనివాడు ఉర్వి అంతా తన చేతిలో వున్నా లేని వానితో (పేదవానితో) సమానమే అనేది కవి భావం. ఇది స్పష్టంగానే వుంది.

తరువాత ". . . . . గ్రామరెడ్డి నిరంకుశుడు; క్రూరుడు., దుర్మార్గుడు. అతని కొడుకు కూడా అంతే. ఈ విషయం 'గాథాసప్తశతి' లోని కొన్ని గాథల వల్ల స్పష్టమవుతుంది" అని, ఉదాహరణకు హరియాలుడనే కవి గాథ ఇచ్చారు (పుట 6; 1:22). ఈ గాథలో గ్రామరెడ్డి కొడుకు గ్రామరెడ్డి లాగే నిరంకుశుడు,

క్రూరుడు, దుర్మార్గుడు అనే భావం వ్యాఖ్యాత యెక్కడ వెదికి పట్టుకున్నారో అని ఆశ్చర్యం వేస్తూంది. అసలు గాథయొక్క సందర్భం శృంగారాన్ని గురించిందే. గాథలోని 'కటికవాడవు' అన్న ఒక్క పదాన్ని బట్టి గ్రామరెడ్డి కొడుకును కవి క్రూరుడుగ భావించి చెబుతున్నట్లు అర్థం చేసుకున్నారు లాగుంది. 'కటికవాడవు' అన్నపదం శృంగారం విషయంలో పెదరెడ్డి కొడుకును వ్యంగ్యంగ నిందించటానికి వుపయోగింప బడ్డది అనే విషయం వాఖ్యాత గ్రహించినట్లు లేదు. 'పెదరెడ్డి కొడుకువు అయివుండి కూడ భార్యకు భయపడి ప్రవర్తిస్తావు. కఠినుడవు సుమా! నీ దర్శనమే అసాధ్యమైపోయింది. అయితే నీకోసం (నీ దర్శనం కోసం) వూరంతా వెతపడి పోతూవుంది' అని ఒక జాణ రెడ్డి కొడుకును వుద్దేశించి నిష్ఠూరం ఆడుతూ వుందని గ్రహించవచ్చు. సాధారణంగా ఆనాటి సమాజంలో స్త్రీ పురుషులు – అందులోనూ అవకాశాలు వున్న రెడ్డి కొడుకు వంటి విలాస పురుషులు విచ్చల విడిగానే ప్రవర్తించే వారని ఊహించవచ్చు. కాని ఇందుకు మినహాయింపులాగా కనబడుతూన్న ఈ గాథలోని రెడ్డి కొడుకు అందుకే 'కటికవాడవు' అని నిందింప బడుతూవున్నాడు.

మరొక గాథ (పుట 116; 1: 471) ను ఇలా వ్యాఖ్యానించారు— "రెడ్డి తన అవసాన దశలో కొడుకును పిలిచి తనలాగ పాడు బ్రతుకు బ్రతక వద్దని హితవు చెబుతాడు." కాని రెడ్డిగారు తన అవసానదశలో కుమారున్ని పిలిచి బుద్ధి చెబుతూ, వ్యాఖ్యాత ఉద్దేశించినట్లుగా తనది పాడు బ్రతుకని పశ్చాత్తాపం ప్రకటించినట్లు కాని, తనలాగ బ్రతకవద్దని కాని చెప్పినట్లు తోచదు. "నాదు పేరు సెప్పుకొనుచు సిగ్గుచేటుగా బల్లెలో బంద బ్రతుకు బ్రతుక వలదు" అని రెడ్డి బుద్ధి చెప్పటంలో— 'నా పేరు చెప్పుకొని నీవు పిరికి పంద బ్రతుకు బ్రతకటం సిగ్గుచేటు. అలా కాకుండా నీవు వ్యక్తిత్వం యేర్పరచు కొని బ్రతక వలసిందన్న' భావం వ్యక్తమవుతూంది. తాను బ్రతికినంత కాలం తన పేరు మీద బ్రతుకుతూ నిష్ప్రయోజకుడైన కుమారున్ని తండ్రి పిలిచి తన అనంతరం అయినా బాగుపడు మన్న హెచ్చరిక చేస్తున్నట్లు ధ్వనిస్తూంది.

ఇంకొక గాథ (పుట 71; 1: 285) లో 'విరహ దుఃఖం భరించడం కష్టం' అన్న విషయాన్ని ప్రధానాంశంగా వర్ణిస్తాడు కవి. ఆ దుఃఖం భరించడం యెంత కష్టమంటే 'కానివారి' సిరిని చూస్తూ వుండటం అంత కష్టం అంటాడు. అయితే ఈ భావాన్ని వ్యాఖ్యాత 'పరుల సంపదను చూస్తూ భరించడం కష్టం. ఎంత కష్టమంటే ప్రియురాలు విరహ బాధ నోర్వడ మంత కష్టం' అని వ్యాఖ్యానించారు.

పై గాథని కవి ఆనాటి వాస్తవాల్ని తెలిపే ఉపమానాలచేత అలంకరించాడు కాబట్టి— శత్రువుల సంపద చూస్తూ వుండటం, విభవహీనుడై బంధువుల మధ్య బ్రతకడం అనేవి ఆనాటి వారికి కష్టాలు అన్న అంశం గమనించ వచ్చు.

గాథ (పుట 72; 1: 290) లో 'కలపము' అన పదానికి 'పేడనీళ్ళు' అన్న అర్థం తీసుకొని "ఫాల్గుణోత్సవం నాడు సరసు లొకరి మీద ఒకరు పేడ నీళ్ళు చల్లుకోవడం సంప్రదాయం" అని వ్యాఖ్యానించారు. కాని 'కలపము'

అన్న శబ్దానికి అర్థం సాధారణంగా చందనం కలిపిన పరిమళ ద్రవ్యం అనేది. ఈ గాథలో సందర్భానికి అనుగుణంగ ఈ అర్థం గ్రహించడమే సరసం.

మరో గాథలో (పుట 132; 11: 23) 'ప్రేమ' అనే పదానికి 'పాతివ్రత్యం' అన్న అర్థాన్ని వ్యాఖ్యాత లాగినట్లు అనిపిస్తూంది. 'మోసమున తోచునది, బలవంతమున కలుగునది, డబ్బు పేరాస వల్ల చూపట్టేది, మొగమాటమునకు ప్రదర్శింప బడేది అయిన ప్రేమకు దండములు సుమా' అన్నది ఇక్కడి భావం. సాధారణంగ లోకంలో ప్రదర్శితమయే అలాంటి కపట ప్రేమలకు మనసు నొచ్చుకున్నవారి భావం ఇది.

ఈ విధంగా ఇంకా మరికొన్ని గాథల్ని వ్యాఖ్యానించేప్పుడు కూడ కవి భావాలకు వ్యాఖ్యాత కొంచెం దూరం కావటం జరిగింది. ఒక రచనా కాలం నాటి సామాజిక పరిస్థితుల్ని అంచనావేయటంలో మారుమూల ధ్వనించే భావాన్ని కూడ వెదికి పట్టుకోవచ్చు కాని, మన దృక్పథానికి అనుకూలంగా కవి భావాల్ని మెలితిప్పటం మాత్రం భావ్యం కాదు.

# స్వీయ కథా పఠనం

## చర్చావేదిక

ఒక నగరం చేరువలో కూలీ నాలీ చేసుకుంటూ బతుకు వెళ్లబుచ్చుతోన్న పేదల్ని, పనులు దొరుకుతాయని నచ్చజెప్పి, వేరే చోటికి తరలిస్తారు, ఫాక్టరీ పెట్ట బోతోన్న స్థితిమంతులు — ఈ కొత్త చోటు అనువైంది కాదు. పురుగు పుట్ర వాతపడి కొందరు హతమారి పోతారు. ప్రాణ నష్టమే కాదు, ఫాక్టరీ వల్ల పనులు దొరికి వాళ్లు సుఖపడిందీ తక్కువే. సమ్మెలూ, పస్తులూ తప్పవు. ఇంతలో యిది చాలనట్టు అష్టకష్టాలూ పడి కట్టుకున్న యిళ్లు కాళీ చెయ్యమని ప్రభుత్వం నోటీసిస్తుంది. అందరూ కూడ బలుక్కొని ఎం. ఎల్. ఏ. ని బ్రతిమాలుకొని, చందాలు వేసుకొని కూడబెట్టిన రెండు వందల రూపాయిలు ఖర్చులకిచ్చి, యీగండం తప్పించమని హైదరాబాదు ఆయన్ని పంపిస్తారు. అతను ఒకంతట తిరిగిరాడు. చివరికి వస్తాడు, పోలీసులు యిళ్లు పీకి పారేస్తూ, వాళ్లనందర్నీ నిరాధారుల్ని చేస్తున్న సమయానికి. ఒక వేపు కొంపలు కూల్చే కార్యక్రమం సాగుతూ వుంటే, యింకోవేపు ఆయన గారి కారు దుమ్ము రేపుకుంటూ పోతుంది.

సెప్టెంబరు 3వ తేదీని ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో జరిపిన కథానికా పఠనంలో శ్రీ. వై. వి. ఎస్. ఎస్. ఎన్. మూర్తి చదివిన "చీమలు పెట్టిన పుట్టలు" యితివృత్తం యిది (ఈ సంచికలో ప్రచురింప బడాతోంది). ప్రతి ఒక్కరూ బాల్యంలో బట్టీ పెట్టిన ఒక పద్యభాగం శీర్షికగా వున్న యీ కథలోని ముఖ్య సంఘటనలు ఒకప్పుడూ యిప్పుడూ జరుగుతున్నవే. కథకుడు జరిగిన దానినే కథగా రాశాననిచెప్పారు. సంభాషణలు విశాఖ మాండలికంలో నడిచాయి.

"నాకో తోడు కావాలి" అన్న శ్రీ ఉపద్రష్ట సాయి కథ - యిటువంటి దెక్కడైనా జరుగుతుందా అని అనుమానం కలిగించేటంత అపురూపమైన యితివృత్తంతో కొనసాగింది. ఒంటరిగా వుంటోన్న కథా నాయకుడికి, అందరూ అబ్బుర పడేంతగా టపా వస్తోంది రోజూ. తన ఏకాకిత్వం నుండి బయట పడేందుకు, పత్రికలకు ఏవో ఒకటి రాసి తెగ పంపుతుంటాడు. అవి సాధారణంగా స్వస్థానాన్ని చేరుకుంటాయి. అటువంటి స్థితిలోనే వున్న కథా నాయకితో పెళ్లి కావడంతో యిద్దరి సమస్యలూ తీరిపోయి, రచనా వ్యాసంగం ముగుస్తుంది.

కథ చదివాక, జరిగిన చర్చలో రచయిత, ముగింపు మార్చాలనుకుంటున్నానని చెప్పారు. అనాకారిగ వున్న ఒకావిడ, తనను ప్రేమించేవారు కాని, ప్రేమలేఖలు రాసేవారు గాని లేక పోవడం వల్ల, తనకు రాని ప్రేమలేఖలకు వేరొకరిచేత జబాబులు (ఆమెకు అక్షర జ్ఞానం లేదు) రాయించుకునే యితివృత్తం వున్న గోర్కీ కథను శ్రీ మహీధర రామమోహన్‌రావు ప్రస్తావించారు.

చిన్న చిన్న సమస్యలు సర్వసామాన్య సమస్యలుగా చేస్తూ, ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని స్వప్రయోజనాలకు ఉపయోగించుకోవడమే కాకుండా ప్రజలను యిబ్బందుల పాలు చేస్తూన్న కొందరు తెల్ల చొక్క ఉద్యోగుల వైఖరిని శ్రీ టి. ప్రసన్న కుమార్ 'పోరాటం', తెలుపుతుంది.

"ఆంధ్ర భూమి" జన్మదిన సంచిక పోటీ కథలపైని, శ్రీ చెరబాడరాజు "మా పల్లె" అన్న నవలపైని, అక్టోబరు 1న జరిగే సమావేశంలో చర్చ జరుగుతుంది.

సమావేశం ప్రారంభంలో 'అభ్యుదయ' అభివృద్ధికి తోడ్పడేందుకు ఢిల్లీ, రూర్కెలా, కాకినాడ, విజయవాడ నగరాలలోని పాఠకులు, అభిమానులు చేసిన సూచనలను శ్రీ మహీధర రామమోహన రావు వివరించారు. నూట పదార్లు శాశ్వత చందాగా నిర్ణయించి వసూళ్లు ప్రారంభిస్తే, తాము బాగా తోడ్పడగలమని ఢిల్లీ మిత్రులు చెప్పిన దానికి, యితర చోట్ల కూడా ఆమోదం వచ్చిందని చెప్పారు. ఈ సూచనను శ్రీ కె. జి. కృష్ణమూర్తి మొదలైనవారు బలపర్చారు.

## బజారు పువ్వులు .... ఏ. సూర్యప్రకాశ్

క్రేబరే నృత్యంలో
ఒంటి మీది
ఒక్కొక్క పేలికను విప్పేసి
ఒళ్ళంతా కళ్ళతో చూస్తున్న
రసిక జనుల
కళ్ళకు ఒళ్ళప్పగించే
దగాపడిన చెల్లెళ్ళు ...

బజారు పువ్వులు
[illegible]

మకిలి భావాలు
వెకిలి చేష్టలు....

కళ్ళు కానని కామం
కనిపారేసిన
అంగట్లో బిడ్డలు
వాళ్ళు రేపటి రౌడీలు, కేడీలు
గజదొంగలు, నరహంతలు
వాళ్ళు సమాజ శరీరంలో
[illegible]

# ఫలించిన జోస్యం

కథానిక

పి. వి. శ్రీపతిరావు

"రండి సార్! రండి! పది పైసలే నండి. జరగబోయేది తెలుసుకోండి! చేతిలోని అదృష్టం తెలుసుకోండి! ఈ రోజు కాలి నడకన పోతారు, అదృష్టం కలిసొస్తే రేపు కారులో వెళ్తారు! జరిగింది, జరుగుతున్నది, జరగబోయేది ఒక్క పది పైసలుకే చెబుతానండి. ఒక్క పది పైసలతో అనుకుంటోన్న పని జరుగుతుందో, లేదో తెలుసుకోండి!"

రోడ్డు పక్కన పేవ్‌మెంటు మీద నిలబడి అతను అరుస్తున్నాడు. చుట్టూ జనం బాగా మూగి ఉన్నారు. అందరూ నాలా బస్సుకోసం ఎదురు చూస్తున్న వాళ్ళేనేమో! బస్సు రావడానికింకా చాలా సేపవుతుంది. కాలక్షేపం కోసం నేనూ వెళ్ళి నిలబడ్డాను.

అప్పటికే అతను ఒక కుర్రాడి చెయ్యి చూస్తున్నాడు. ఆ కుర్రాడి నిక్కరు, మాసిపోయిన బనీను, వాటి మీద పిండి మరకలు – హోటల్లో క్లీనరు కుర్రాడులా వున్నాడు.

"చిన్నతనం నుంచీ కష్టాలు నిన్ను వెంటాడుతునే వున్నాయి. నువ్వు చేసే పనిలో జాగ్రత్త అవసరం. కత్తిమీద సాములాంటి వుద్యోగం. సంచారంలో శనివున్నా, గురువు ప్రభావం అధికంగా వుంది. కాబట్టి చిన్న చిన్న అడ్డంకులు వచ్చినా, వాటికవే పోతాయి. గురువు ప్రభావం చేత వృత్తిలో పైకి పోగల అవకాశాలు హెచ్చుగానే వున్నాయి. అయితే సంపాదించిందంతా ఎప్పటి కప్పుడే ఖర్చుపెట్టే చెయ్యి నీది" అంటూ చుట్టూవున్న జనాని కర్థమయ్యా, కాని గ్రహాల భాషలో చెబుతున్నాడు.

ఆ కుర్రాడు మాత్రం, అప్పుడే తాను సర్వరు అయిపోయినట్లు భావించుకుని, పావలా కాసుని అతి విలాసంగా అతని కందిచాడు – ప్రమోషనొస్తే సర్వర్ అయ్యాక వచ్చే టిప్పును తలుచుకుని మురిసిపోతూ!

జోతిష్కుడు చూడ్డానికి లావుగా, తారు డ్రమ్ముకు బట్టలు చుట్టబెట్టి నట్టున్నాడు. కళ్లకు మందమైన అద్దాలు, నుదుటి మీద అడ్డంగా మూడు విభూతి రేఖలు, మధ్యగా ఎర్రబొట్టు, చేతిలో భూతద్దం – వాలకం చూస్తుంటే దెయ్యాల చేత సర్కస్ చేయించే రింగు మాస్టరు మాదిరిగా కన్పిస్తున్నాడు. మనిషి ఎలావున్నా, రావు గోపాలరావు గొంతులాంటి అతని గంభీరమైన బొంగురు గొంతు ప్రజల నాకర్షిస్తోంది. మాటలు బాగా చెలామణీ చేస్తున్నాడు.

అతనికి యిరు ప్రక్కలా రక్షక భటుల్లా, రెండు అట్టలు ఎదురు బద్దల మీద నిలబడి వున్నాయి. అట్టల మీద 'హస్తం' వుంది. ఆ వెనక గోడ మీద మూడు ఫోటోలు. వాటిల్లో ఒకటి – ఒక విశ్వనట చక్రవర్తితో, రెండోది విశ్వ విఖ్యాత నటసామ్రాట్టుతో అతను దిగిన ఫోటోలు. మూడు రోజుల మంత్రి వర్గంలోని, ఒక మంత్రిగారి చెయ్యి పట్టుకుని – కెమెరావైపు చూస్తూ మూడో ఫోటో! దానికింద 'జ్యోతిశ్శాస్త్ర విద్వాన్' అన్న బిరుదుతో తన పేరు. ఆ వెనక [illegible]

నాలుగైదు డిగ్రీలు.

తరువాత పక్క బంకుల్లో టీ తాగి, కిళ్ళీ బిగించి, బీడి కాలుస్తూ చుట్టూవున్న జనానికి ఇందిరా గాంధీకి ఎన్నికల గుర్తు 'హస్తం' కేటాయించి వుండక పోతే ఆమె చెయ్యిపైకి లేచేది కా దంటూ చెయ్యెత్తి మరీ, హస్త మహాత్మ్యం వివరిస్తున్నాడు జ్యోతిశ్శాస్త్ర విద్వాన్.

ఇంతలో సన్నగా, చెరుగ్గడలా, చిరుగులు పట్టిన లాల్చీ, మాసిపోయిన పంచె, తైల సంస్కారం లేని జుట్టుతో అదృష్టం వెతుక్కుంటూ ఒకతను వచ్చాడు. వచ్చీ రావడంతోనే పది పైసలు బిళ్ల లాల్చీ జేబులోంచి తీసి, జ్యోతిష్కుడి పుస్తకం మీద పెట్టాడు. చెరుగ్గడ చెయ్యందుకుని, కళ్లజోడును ముక్కుచివరకు అనించుకుని, భూతద్దాన్ని తువాలుతో తుడిచి, అరిచేతి మీద అటూ, యిటూ తిప్పుతూ, ముక్కుదగ్గర నుంచి చెయ్యిదాకా భూతద్దాన్ని నడిపిస్తూ సీరియస్‌గా పరీక్ష సాగింది.

చెరుగ్గడ ముఖంలో పరీక్ష రిజల్టు కోసం ఎదురు చూసే విద్యార్థి ఆతృత. చెయ్యిచూడడం ఆపి, గ్రహాల డైలాగులు వల్లింపు జరిగింది. "అయితే నీ అరిచేతిలో ధనరేఖ ట్రంకు రోడ్డులా వెడల్పుగా వుంది. కాబట్టి శాస్త్రరీత్యా ఎప్పుడూ నీ చేతిలో డబ్బాడుతూ వుంటుంది. రవి ప్రభావంచేత రాగల రెండు రోజుల్లో ఆకస్మిక ధనలాభం. అయితే నువ్వు కొంచెం కష్టపడవలసి వుంటుది. ఈ రెండ్రోజులూ తెలివిగా కనుక వ్యవహరించావంటే నీ దశ మారిపోయే అవకాశముంది".

స్విచ్ వేస్తే వెలుగు పుట్టినట్టు, అతని ముఖంలో చివరి మాటలు వెలుగు పుట్టించాయి.

జ్యోతిష్కుని ఆశల అమ్మకం, ఎన్నికల్లో వాగ్దానాల అమ్మకం జోరులో సాగిపోతోంది.

ఇంతలో నే నెక్కవలసిన బస్సు వచ్చింది. పరుగుపరుగున బస్సులో చొరబడ్డాను.

రెండ్రోజులు పోయిన తరువాత అదే బస్టాండులో బస్సు ఎక్కేనో లేదో, హఠాత్తుగా, పెద్దగోల.

"కొట్టండి! చంపండి వెధవని" అంటూ దూరంగా ఓ గుంపులో అరుపులు, దబదబా చప్పుళ్లు. "నిన్నటి వరకూ యీ బస్టాండులో అడుక్కొం టుండే వాడండీ! పిదప కాలం — పిదప బుద్ధులూనూ! ఎవరో పెద్ద మనిషి బస్సెక్కుతూంటే జేబులో పర్సు కొట్టేశాడు. చూస్తే అడుక్కునే వేషం — చేసేది దొంగతనమూనూ!" గుంపులో ఒకడు ఆవేశంతో చెప్పుకపోతున్నాడు.

తలొంచుకుని దెబ్బలు కాసుకొంటూ చెరుగ్గడ!

పేవ్‌మెంటు మీద అందరితో పాటు ఫలించిన తన జోస్యాన్ని చూస్తోన్న జ్యోతిశ్శాస్త్ర విద్వాన్.

నవల జీవితానికి సరిగ్గా సరిపడుతుందా అని చూడడానికి అది జీవితానికి నకలు కాదు. జీవితంలో ఒక భాగానికో, ఒక అంశానికో అది కృతక సులభ రూపకల్పన మాత్రమే. ఆ రూపకల్పనలోనే దాని విజయమో, వైఫల్యమో వుంటుంది.

(ఎమిలీ జోలా).

# పెళ్ళి కానుక

ఎస్. ఆర్.

ఇవాళ కమలా, మోహన్‌ల పెళ్ళి
మిత్రులందరికీ ఆనందం పాలవెల్లి

అలసి పెళ్ళి చేసుకున్నా
వలచి పెళ్ళి చేసుకున్నా
విచ్చుకోవాలి దాంపత్యం
వసంతంలో ప్రత్యూషంలా
అఖ్తర్ గానంలో ఆలాపనలా

దాంపత్యం సంగీతమైతే
లయ భార్య, తాళం భర్త
లయ లోపించినా, తాళం తప్పినా
జనించదు శబ్ద సౌందర్యం
రాణించదు వివాహజీవనం

దాంపత్యం సాహిత్యమైతే
అక్షరం భార్య, అర్థం భర్త
వాక్కుకు అవసరం హద్దు
అర్థానికి అనౌచిత్యం వద్దు
సంసార కవిత్వంలో
మనస్తాపాలు, అపార్థాలు
నిషిద్ధాక్షరాలు
అవి వుంటే సుఖం పూలు రాలు

కడుపులో ఏదీ ఎప్పుడూ దాచుకోకండి
గుండె గుండీలు విప్పి మాటాడుకోండి
దాంపత్య మంటే మిత్రులారా
సుఖాలు గుణించడం కాదు
శబ్దాన్ని అర్థాన్ని లయించడం
కలల్ని కమ్మగా వాస్తవీకరించడం
ఆత్మ సౌందర్యాన్ని ఆవిష్కరించడం

నిజానికి సంసార జీవనం
శృతి చేసిన సంగీత సాధనం
చేతి నైపుణ్యం బట్టి స్వరం
మధురిమలూ పలకొచ్చు
అపశృతులూ గిలకొచ్చు
కోరికలు గుర్రాలు కావద్దు
సీదా సాదాగా బతకడమే ముద్దు
మిడిల్ క్లాస్ భేషజాలకు పోవద్దు

బంధువులకు అవొద్దు భారం
మిత్రులకు కావద్దు దూరం

అందరికీ పలకండి ఆహ్వాన తానం
మీ జీవితాలను చేసుకోండి
ఆపాత మధుర అమృత గానం

ఇంతటితో హితబోధ ఆపేస్తా
ఇపుడు మీరున్నది చౌరాస్తా

ఇక్కడ వెతుక్కోండి మీ సైన్ బోర్డు
స్వయంగా వెళ్ళండి, అక్కర్లేదు గార్డు

ఒడిసి పట్టేవాడికే
లొంగుతుంది జీవితం
జడిసి పోయారంటే
శాసిస్తుంది జాగ్రత్త!

జీవితం రైలు బండికి డెస్టినేషన్
యేమిటి? సుఖం. శాంతి,
దారి మధ్యలో ఎదురయ్యే ప్రతి స్టేషన్
వద్ద పుచ్చుకోండి విశ్రాంతి.


చిరునామా మార్పు

'అభ్యుదయ' కు సంబంధించిన ఉత్తరాలు, పంపే రచనలు; మనిఆర్డర్లు, డ్రాఫ్టులు, చెక్కులు మొదలైనవి యీ దిగువ చిరునామాకు పంపవలసిందిగా విజ్ఞప్తి.

ABHYUDAYA
R - 3 Llyods,
Madras - 600 014

# సరిహద్దు ప్రాంతాల్లో భాషా సమస్యలు

హెచ్. యస్. బ్రహ్మానంద

ప్రతి భాషా వ్యవహారానికీ భౌగోళికమైన సరిహద్దులు ఉంటాయి. సరిహద్దులలో సామాన్యంగా రెండు మూడు భాషలు వ్యవహారంలో వుంటాయి. అక్కడి ప్రజలు రెండు భాషల్ని సమాన ప్రతిభతో వాడటం కాని, ఆ రెంటికీ చెందిన మరో శైలి నాశ్రయించి వ్యవహరించడం కాని గమనించవచ్చు. మన తెలుగు భాష అదిలాబాద్ ప్రాంతంలో మహారాష్ట్ర భాషతోను, శ్రీకాకుళం ప్రాంతంలో ఒడియా భాషతోను, చిత్తూరు, అనంతపురం ప్రాంతాల్లో తమిళ, కన్నడ భాషలతోను కలసి వ్యవహరింప బడుతూ వుండటం ఆయా ప్రాంతాల్లో ఉన్నవాళ్ళకు బాగా అవగాహనలో వుంటుంది. ఏ రెండు భాషలకైన ఈ స్థితి అనివార్యమే కాని, ఆర్థికంగా వెనుకబడిన మన దేశంలో ఈ సమస్య మరికొన్ని సమస్యల్ని పుట్టించడం గుర్తించవచ్చు. ఈ ప్రసంగంలో, నేను పరిశీలించిన కొన్ని అంశాల్ని ప్రతిపాదిసాను. మూడు చోట్ల ఈ పరిశీలన జరిగింది. మొదటిది చిత్తూరు జిల్లా పుంగనూరు జూనియర్ కాలేజి పిల్లలతో. రెండవది అనంతపురం జిల్లా రాయదురం జూనియర్ కాలేజి పిల్లలతో. మూడవది కర్నాటక రాష్ట్రంలో కోలారు జిల్లా హెబ్బణి అన్న పల్లెలోని ప్రాథమిక పాఠశాల పిల్లలతో. ఈ మూడు చోట్లలోను విద్యార్థులలో వెనుకబడినతనం బాగా విస్తారంగా కనిపిస్తుంది. ఆర్థికంగా మాత్రమే కాకుండా సాంఘికావగాహన (Social understanding) విషయంలో కూడా ఈ పిల్లలు చాలా వెనుకబడి ఉండటం గుర్తించవచ్చు. నేను చేసిన పరిశోధన, పిల్లల్ని ప్రసంగంలోనికి దింపి వాళ్ళనుంచి సందేహాలు, సమాధానాలు, ప్రశ్నలు అభిప్రాయాలు రాబట్టడం ద్వారా జరిగింది. ఇక్కడ పరిశోధన ఫలితాలను మాత్రం చెప్తాను.

హెబ్బణి పాఠశాల్లో దాదాపు నూటా ఏభై మంది చదువుతున్నారు. 1 నుంచి 5 దాకా చదివే పిల్లల్లో చాలమందికి కన్నడం రాదు. అది మైసూరు రాష్ట్రం కాబట్టి కన్నడమే చదవాలి. ఇంట్లో, బయట స్నేహితులతో విద్యార్థి ఎప్పుడూ తెలుగు మాట్లాడుతూ వుండటం వల్ల, కన్నడ భాషకు విద్యార్థి మనస్సు 'expose' కావడానికి దాదాపు 5 సంవత్సరాల కృషి కావాల్సి వస్తుంది. అక్కడి ఉపాధ్యాయులు కన్నడ పదాల్ని విద్యార్థులకి పరిచయం చేయించడానికి తెలుగు అనువాదం చెప్పి, పాఠాన్నంతా తెలుగులో వివరించి నేర్పిస్తున్నారు. ఇలా విద్యార్థులు పాఠ్యాంశాలవైపు మొగ్గు చూపి, విజ్ఞాన జిజ్ఞాసవైపు కేంద్రీకరించవలసిన మొగ్గ దశలో

భాషల్ని నేర్చుకోవడం వైపు లాగ బడటం వల్ల వాళ్ళకి లెక్కలు, సైన్సు మొద లైన అంశాల మీద శ్రద్ధ తగ్గిపోవడం వుంది. అసలే దారిద్ర్యానికి తోడు తమ మాతృ భాష అయిన తెలుగులో పాఠాలు లేకపోవడం నిజంగా దురదృష్టమని వాళ్ళు అంటారు. ఒక అబ్బాయిని ఇలా ప్రశ్నించాను.:

'నిన్న హెసరేను ?'

ఆ అబ్బాయి సమాధానం వినండి: 'నా పేరు కృష్ణప్ప'. నా ప్రశ్న కన్నడంలో వుంటే, ఆ అబ్బాయి సమాధానం తెలుగులో వస్తోంది. కన్నడంలో చెప్పరా! అని. వాళ్ళమాష్టారు చెప్పితే తరువాత చెప్పాడు. అదీ తెలుగు వాక్యంచెప్పినట్టే చెప్పాడు మీ ఇంట్లో మాట్లాడే భాష ఏమిటి ? అని దాదాపు 30 మందిని అడిగితే 28 మంది 'తెలుగు' అని సమాధానం చెప్పారు. అలాగే 'elephant' అన్న ఇంగ్లీషు పదానికి అర్థం ఏమిటి? అని అడిగితే 'ఏనుగు' అని చెప్పిన వాళ్ళు తప్ప, 'ఆనె' అని చెప్పిన వాళ్ళు ఒకరో ఇద్దరో. వాళ్ళు కూడా కన్నడం మాతృభాషగా వున్న వాళ్ళ పిల్లలన్న మాట. కన్నడంలో పాట పాడమని అడిగితే ఆ యిద్దరే పాడారు. తెలుగు పాటలు అందరికీ వచ్చు. కథ చెప్పమంటే చాలా మంది వెనుకాడారు. కాని చెప్పిన వాళ్ళు తెలుగులోనే చెప్ప గలిగారు. కన్నడంలో ఒకరే చెప్పారు. వెనుక బడిన జాతులు పిల్లలు ముఖ్యంగా, తెలుగు తప్ప కన్నడంతో అసలు సంబంధం లేని వాళ్ళుగా కనిపించారు.

సరిగ్గా దీనికి వ్యతి రేకమయిన అనుభవం రాయదుర్గం పిల్లలతో జరిగింది. అక్కడి వాళ్ళు 'వాడు బరికెలి పోతున్నాడు' లాంటి వాక్యాలు వాడుతారు. పిల్లలు కన్నడం పాటలు, కథలు తెలిసినవాళ్ళు. ఇళ్ళలో కన్నడం అత్యధిక వ్యవహా రంలో వుంది. కాని రాయదుర్గం ఆంధ్ర రాష్ట్రంలో వుంది.

మూడవ చోటు పుంగనూరు. ఇది ఆంధ్ర ప్రదేశ్‌లో ఒక సరిహద్దు తాలూకా. ఇక్కడా విద్యార్థులలో వెనుకబడినతనమే. రాష్ట్రాలు కేంద్రానికి – కేంద్ర ప్రాంతాలకు చూపిన శ్రద్ధ సరిహద్దులకు చూపవు. ఫలితంగా సరిహద్దు భాషలపై కేంద్ర వ్యవహారికి కొంత చిన్న చూపు వంటిది కనిపిస్తుంది. పుంగనూరులో వున్న విద్యార్థులకు చాలా మందికి తమది ఆంధ్ర ప్రదేశమని తెలియదు – మరీ చిన్న తరగతుల్లో. 7 వ తరగతి విద్యార్థుల్లో కొంత మంది రేడియో, సినిమాలలో కనిపించే నాగరిక ప్రమాణ మాండలికం వైపు – అంటే అలాగా, ఇలాగా, వంద, చేశాను, వెళ్ళాను, వచ్చాను. మొదలైన పదాలను వాడ్డం ద్వారా –తాము ఆంధ్రీకృతులౌ తున్నట్టుగా ప్రవర్తించడం గుర్తించాను. అట్ల, ఇట్ల, నూరు, చేసినాను, వచ్చితి (వస్తి) పోతి ఇలాంటి పదాలను వాళ్ళు పల్లె వాళ్ళ పదాలుగా గుర్తించడము దీనికి నిదర్శనమే. ఇలాగా ఈ మూడు ప్రాంతాల్లోనూ రెండు రకాల సమస్యలు కనిపిస్తున్నాయి. ఒకటి – రెండు భాషల ప్రభావంతో విద్యార్థి ప్రతిభ సంకుచితం కావడం. రెండు – కేంద్రానికి దూరం కావడంతో రాష్ట్రంతో – రాష్ట్ర మాండలికంతో – సరిహద్దులోని మానవుడు సమానంగా గుర్తింపబడక పోవడం.

ఆంధ్ర రాష్ట్రంలో రాయలసీమ వెనుకబడిందని చాలా దృష్టులతో

చెప్పడం వుంది. భాషాదృష్టితో కూడా ఇది నిజమని నిరూపించడానికి ఇది నీదే స్థానం. కాని ఒక్క విషయం మాత్రం చాలా ప్రధానమైనది. భాషానిర్మాణ దృష్టితో ఏ మాండలికమూ గొప్పదీ కాదు - తక్కువా కాదు. ఆర్థిక సాంఘికాది కారణాలవల్ల ఒకో మాండలికం ప్రమాణంగా పరిగణించ బడుతుంది. సాంఘిక చైతన్యం పెరిగి ప్రజల్లో ఏకత్వ భావం వ్యాపిస్తే, క్రమంగా ఈ మాండలిక భేదాలు సన్నగిల్లి ఏదో ఒక సమాన మాండలికం వృద్ధిచెందుతుంది. ఇటీవల మన కడప రేడియోని గమనిస్తే ఈ మార్పు గుర్తించవచ్చు. ప్రసంగాల్లోకాని, ప్రకటనల్లో కాని, చర్చల్లోకాని ఒక 'ఆధునికత' వినిపిస్తోంది. ఆ ఆధునికతే సరిహద్దు ప్రాంతాలను కేంద్రంతో కలుపుతున్న అంశం. ఆ దృష్టితో కూడా ఇందాకా చెప్పుకొన్న మూడు ప్రాంతాలలో చాలా మార్పు రావాల్సిన అవసరముంది.

ఈ సమస్య స్థూలదృష్టికి అంత ప్రధానంగా కనిపించదు. కాని ప్రధానమని గుర్తించి పరిశోధనలు జరిపినవాళ్ళు పాశ్చాత్యులు. Joshua A. Fishman అనే ఆయన బహుభాషలు వ్యవహరింపబడే ప్రాంతాల్లో వెనుకబడినతనమూ, ప్రమాణైక భాష వున్న ప్రాంతాల్లో అభివృద్ధీ కనిపిస్తున్నాయని ఒక వ్యాసంలో ప్రతిపాదించాడు.

భాషసంఘంలో అభిప్రాయ నివేదనకు – సహకారానికి సాధన మాత్రమే అని ఈనాడు ఎవరూ అనుకోవడం లేదు. మానవుడి అన్ని ఆలోచనలకు 'reservoir' భాష. సంఘంలో మనిషి ఉనికి 'భాష'ను ఆశ్రయించి వుంది. ఎన్ని భాషలు మట్లాడగలిగితే అంత ప్రపంచాన్ని సులభంగా తిరిగి రావచ్చు – అని ఒక అభిప్రాయం వుంది. భాషలు ఒక దశ దాటిన తర్వాత నేర్చుకోవడానికీ, పిల్లతనంలో రెండు మూడు భాషల మధ్య నలగడానికీ భేదముంది. ఆ దృష్టితో కొన్నిమానవ సంఘాలను కలుపుతున్నది భాష అయినట్లే – సంఘాలను వేరుచేస్తున్నదీ భాషే అవుతోంది. అందువల్ల సంఘం వృద్ధిపొందాలంటే భాషా వ్యవహర్తల మధ్య ఒక మంచి 'agreement' వుండాలి. అది ముఖ్యంగా భాష విషయకంగానే. మన ప్రభుత్వం వారి ప్రణాళికలు చాలావరకు గ్రామ దశకు చేరుకోవడం లేదంటే – దానికి విద్యలేక పోవడమే కారణమంటే – వాళ్ళకు మన వ్యవహారం (communication) అందడంలేదని అర్థం. ఆ దృష్టితోనే రేడియోలో 'పాడి పంట', 'ఇల్లూ వాకిలి', 'మాటామంతీ' మొదలైన కార్యక్రమాల్లో ఆయా మాండలిక వ్యవహారం వినిపించేలా చేస్తున్నారు. విద్యను గ్రామములకు సన్నిహితంగా తీసుకుపోవడంలో ఇదో పద్ధతి. ముఖ్యంగా సరిహద్దు సీమలైన చిత్తూరు, అనంతపురం జిల్లాలకు ఈ సహకారం చాలా కావల్సిన అవసరం వుంది. ఇంకా ఎక్కువ సంఖ్యలో పాఠశాలల్ని తెరవడం, సినిమాలు, నాటకాలు – ప్రభుత్వ సహకారంతో విద్యార్థుల కోసం చేయించడం మొదలైనవి చేయొచ్చు భాషావ్యాప్తికి. భాషాప్రయుక్త రాష్ట్ర విభజనతో ఇలాంటి నష్టాలు తప్పవు. వీటిని నష్టాలుగా కాకుండా భాషావ్యాప్తికి ప్రయత్నించి లాభాలుగా మార్చుకోవడంలో వుంటుంది మన అభివృద్ధి.

## సమీక్ష

### మా పల్లె

(నవల. రచయిత చెరబండరాజు. వెల రూ. 4. ప్రతులకు చెరబండరాజు - 2 - 2 - 889, అంబరుపేట, హైదరాబాదు, 500 013)

తెలుగు దేశంలోని వేలాది పల్లెలలో 'మా పల్లె' ఒకటి. మిగిలిన పల్లెల వంటిదే అదీను. వాళ్ళే భూస్వాములు. ఆ పెత్తందారీ దౌర్జన్యాలే. అదే దారిద్ర్యం. అదే పీడన. వాళ్ళే వ్యవసాయ కూలీలూ, రైతులూ. భూమి కోసం తహ తహ అదే. అదీ అన్ని పల్లెల్లాంటిదే. కాని, చెరబండ రాజు గారి 'మా పల్లె' లో ఒకే ఒక ప్రత్యేకత వుంది. అది తెలంగాణాలోని పల్లె, తెలంగాణా రైతు పోరాటాల విప్లవ సంప్రదాయంగల పల్లె. హైద్రాబాదు సమీపపు పల్లె. 'మా పల్లె' లో శ్రీ చెరబండ రాజు గారు చిత్రించినది 1974 నాటి పరిస్థితిని. అప్పటికి పల్లెలో భూస్వాముల నిరంకుశ ప్రభుత చితికి పోయింది. పట్వారీల ప్రాభవం బద్దలయింది. సమ్మెలు, తదితర పోరాటాలతో వ్యవసాయ కూలీలూ, రైతులూ కొన్ని హక్కులు, సౌలభ్యాలు, సౌకర్యాలు గుంజుకొన్నారు. ఆ పోరాటాలలో వారికి నాయకత్వం వహించిన మాధవరావు మేస్త్రిని పోలీసులు కాల్చివేయడంతో కథ ప్రారంభమవుతుంది. ఆ హత్యకు నిరసనగా ప్రజాసమీకరణ, ప్రదర్శన, బహిరంగసభ జరుగుతాయి. దానిని అణచి వెయ్యడానికై మరింత పోలీసు నిర్బంధాలు. వరదయ్య అనే మరో నాయకుణ్ని పోలీసులు చంపి వేస్తారు. ఆ కల్లోలాల మధ్య గుండె జబ్బు గురునాధరెడ్డి (భూస్వామి) వరదయ్య చెల్లెలు బాలామణిని చెరచ ప్రయత్నించి ఆమె చేత దెబ్బలు తింటాడు. కాని అతని అనుచరులు ఆమెను సామూహికంగా చెరుస్తారు. ఆమె చచ్చిపోతుంది. దానికి ప్రతీకారంగా గ్రామ ప్రజలను సమీకరించి సిద్దప్ప (ప్రజా నాయకులలో ఒకరు) గురునాధ రెడ్డిని చంపేస్తాడు. మళ్లీ ప్రభుత్వ బలగం పల్లెమీద విరుచుకుపడుతుంది. పడుచుకారు నందర్నీ జైళ్ళలో పెడుతుంది. పల్లెలో ప్రతిఘటనను నడుపుతున్న నాయకత్వం చెల్లాచెదరయింది. కొందరు తప్పించుకొన్నారు. వారు మళ్లీ తమ బలగాన్నీ, బలాన్నీ చేర్చుకొనేందుకూ, కూర్చుకొనేందుకూ చేసే ప్రయత్నంతో నవల ముగుస్తుంది.

180 పుటల ఈ చిన్న నవలలో శ్రీ చెరబండ రాజు ప్రజా వుద్యమాల అపరిహార్య శక్తినీ, తమకు కలిగిన నష్టాల్ని ఎక్కడికక్కడే కొత్త నాయకత్వాన్ని నిర్మించుకొని, లోటు భర్తీ చేసుకోడంలో వాటికి గల జీవశక్తినీ చిత్రించడానికి ప్రయత్నించేరు. అతి ముఖ్యమైన ఒక విషయాన్ని ఈ నవలలో ఆయన చూపేరు. ప్రభుత్వమూ, శత్రు కోటీ దెబ్బ తీసినప్పుడు నిరుత్సాహ పడకుండా, ఉన్న వాళ్లతోనే, వారి నుంచే కార్యకర్తలను కూర్చుకొని, తరిఫీదునిస్తూ, ఉద్యమాన్ని అఖండ జ్యోతి లాగా నిలబెట్టి వుంచాలన్న ప్రబోధం నవలలో ఆద్యంతం కనిపిస్తుంది. ఇది ప్రశంసనీయమైన. చిత్రణ.

స్థూలంగా, నవలలో చిత్రించిన పరిస్థితి ఈ నాటి రాజకీయ వాస్తవాన్ని తెలుపుతూంది. గ్రామాలలోనూ, పట్టణాలలోనూ పద్ధతులు మారినా దోపిడి వ్యవస్థలో మార్పులేదు. ఆ వ్యవస్థ మీద ప్రజల ప్రతిఘటన పెరుగుతూంది. దానికి సమతూకంగా ప్రభుత్వం ఒక మూల ప్రజలను సంతృప్తి పరచేందుకు శాసనాలు చేస్తున్నా, రెండో వేపున పీడక వర్గాలతో ప్రత్యక్షంగా షరీకు అవుతూంది. ఈ పోరాటంలో ప్రభుత్వానికీ, పాలక వర్గాలకి పోలీసు బలగం, సైన్యం, ఆయుధాలు, అధికార బలం అనుభవ బలం, పెట్టుబడి దారీ ప్రపంచ దేశాల అండవుంది. ఇవన్నీ కథా క్రమంలో ప్రసంగాలూ, నినాదాల ప్రసక్తితో మనకు అడుగడుగునా ద్యోతక మవుతూంది.

రెండో వేపున ప్రజోద్యమం స్థితి కూడా అంత స్పష్టంగానూ చిత్రించబడింది. దానికి గల బలం ఏమిటి? సైనిక తరిఫీదు గాని, ఆయుధాలు గాని లేని కొద్ది మంది ఉత్సాహపరులయిన యువకులు. వారికి అధికారం లేదు. అతి ముఖ్యం అయిన అనుభవమూ తక్కువే. దానికి వుదాహరణగా ఈ రెండు మూడు వాక్యాలూ చాలు.

"భూమికోసం, భుక్తి కోసం, విముక్తి కోసం ప్రతి గ్రామంలో ఏదో మేరకు పోరాట శక్తులు ప్రాణం పోసుకుంటున్నాయి" అంటూ నిర్మాణ బలహీనతను సూచిస్తూనే వెంటనే –

"పరిస్థితులు పరిపక్వంగా వున్నాయి. ప్రభుత్వం పండి రాలడానికి సిద్ధంగా వుంది." – అనడం (31 – 32 పుటలు) అనుభవ బలాన్ని తెలపదు.

అలాంటిదే – ఊరేగింపులో ఇచ్చిన నినాదాలు కూడా ఆ అనుభవ శూన్యతకే వేలు చూపుతున్నాయి.

"అమెరికా సామ్రాజ్యవాదం నశించాలి."

"రష్యా సామ్రాజ్య వాదం నశించాలి."

(33 – 34 పుటలు)

రెండు పరస్పర భిన్న సామాజిక వ్యవస్థల్ని ఒకే అవగాహనతో చూడడం విశదం అవుతూంది. ఈ తప్పిదం ఎందుకు వచ్చింది ? ఎవరో స్వార్థ బుద్ధితో రెచ్చగొట్టిన కొన్ని అసంబద్ధ జల్పితాలనూ, ప్రగల్భాలనూ, అనాలోచితంగా, వివేచనా శూన్యంగా స్వాయత్తం చేసుకోడం అనుభవం లేకపోవడమే. అయితే ఈ మానసిక సంక్షోభం పాత్రలదిగా చిత్రించబడలేదు. కేవలం రచయిత భావనలతోనే ఈ వైరుధ్యం, సంక్షోభ వుంది.

అందు చేతనే ప్రత్యక్ష పరిస్థితిని వాస్తవ రూపంలో చిత్రించిన రచయిత కథా గతిని కాల్పనిక ధోరణిలో నడపడం జరిగింది. దీని అర్థం మార్క్సిస్టులు కాల్పనిక వాదాన్ని నిరాకరించాలని కాదు. నిజానికి కాల్పనికతను కమ్యూనిస్టులంత బలంగా పోషించే వారుండరు. కాని వారి కాల్పనికతా వాస్తవాలతో సంబంధం లేని ఊహాలోకం లోదిగాక గతితర్క దృష్టితో చరిత్ర గతి నవగాహన చేసుకొని రూపొందించిన కల్పన అయివుంటుంది.

చరిత్ర గతి యెడ శ్రీ చెరబండరాజుగారి అవగాహనలో లోపం వుందనడానికి ఒక నిదర్శన :

"ఈ దొంగల, భూస్వాముల, గుత్త పెట్టుబడిదారుల ప్రభుత్వం పోవాలి. మాటలలో పోదు ఓట్లతో పోదు, హర్తాళ్ళ ధర్నాలతో పోదు ... (పుట 20). విప్లవ పోరాటం ద్వారా ఈ ప్రభుత్వాన్ని కూలగొట్టాలి". (పుట 21).

ఈ మాటలతో ఏ మార్క్సు వాదీ భేదించడు. కాని పైన చెప్పిన వాటి నన్నింటినీ కమ్యూనిస్టులు విప్లవ పోరాట రూపాల్నిగా, విప్లవంలో భాగాలను గానే స్వీకరిస్తారు. ఓట్ల బలంతో ఏర్పడిన పార్లమెంటు చేసిన చట్టాల్ని ప్రభుత్వం పాటించడం లేదంటూ చూపుతూ ఆ పార్లమెంటుకు, దాని శాసనాలకూ ఒక మూల ప్రాధాన్యం ఇస్తూనే, దానిని స్వాధీనం చేసుకొనేందుకు ప్రయత్నించడం విప్లవ వ్యతిరేక కార్యంగా నిరసించే వాళ్ళున్నారు. దేశంలో వున్న పరిస్థితిని పట్టి విప్లవ పోరాట రూపాలు మారుతాయి, మారాలి అన్న అవగాహన లేకపోవడం చేతనే ఈ ఆలోచన. అయితే కాదు. ఈ పోరాటాలకు భిన్నమైన, అతీతమైన విప్లవ మార్గం ఏదో వుందన్నట్లే నవలలో పాత్రచిత్రణ వుంది. అడవి అన్నది చెట్లతోనే ఏర్పడుతుంది. చెట్లను మినహాయించినదీ, వాటికన్న అతీతమైనదీ కాదు అడవి. చెట్టుకూ అడవికీ వున్న భేదం రాశి ఫలితముగా ఏర్పడిన వాసి. అటువంటి సంబంధమే పోరాటాలకూ, విప్లవానికీ వుంది. ఆ పోరాట రూపాలలో వోటు ఒకటి. కాని అదే విప్లవం కాదు.

మరో ముఖ్యమైన ఆలోచనీయాంశం – "మాలోని వాడివే, మా మనిషివే నీవు పొట్ట కూటికి పోయి, పోలీసువైనావు" అన్న శ్రీ చెరబండరాజుగారి ఆలోచన. ఆ భావాన్నే పాఠకులతో. . .చెప్పిన మాటలలో కూడ ఆయన వివరించేరు.

"తుపాకీ పట్టిన పేద పోలీసులకు 'అప్పీల్' చెయ్యాలేగాని 'ఎటాక్' చెయ్యకూడదేమో అనుకుంటున్నాను. (ఆయుధాలు పట్టుకొని ఎదురుగా నిల్చున్నప్పుడు వేరే సంగతి అన్న మినహాయింపు వుందనుకోండి.)

ఒక్క పోలీసుల విషయంలోనే కాదు, సమాజంలోని అన్ని వర్గాలు, తరగతుల విషయంలోనూ కమ్యూనిస్టుల వ్యవహారం అదే. అంతే.

కాని, చెరబండరాజుగారి ఆలోచనలో ఏదో విశేషం లేకపోతే వారు పోలీసుల్నే ప్రత్యేకించరు ! తమ అవగాహన ఫలితమే రంగనాయకులు పాత్ర అని "పాఠకులతో . . ."

చెప్తున్నారు. నిజం ఆలోచిస్తే నవలలో ఏ పాత్ర మీదకన్న రంగనాయకులు పాత్రమీదనే ఆయన ప్రత్యేక శ్రద్ధ చూపే రనాలి. కాని, ఆ పాత్ర ఆయన ఆలోచనలను సవాలే చేస్తూంది కాని బలపరచడం లేదు.

ప్రజానాయకుడు మాధవరావు మేస్టర్ని కాల్చేసింది రంగనాయకులు. మేస్టర్ని చంపితే ఇస్తానన్న ప్రభుత్వ బహుమతి ధనాన్ని తనపై అఫీసరు కొట్టేసాడనేది రంగనాయకుల బాధ. ఆ బాధతోనే 'మాపల్లె'పై జరిగే అన్ని పోలీసు దాడుల్లోనూ పాల్గొంటాడు. చిత్రహింసలన్నింటి లోనూ అతని చెయ్యివుంది. హింసా కాండ జరిపేది రాయి కాదు. మనసున్న మనిషి. కసక ఎప్పుడేనా "ఇదేం పని" అనిపించక పోదు. రంగనాయకులకూ అనిపించింది. కాని హింసలు చేసేటప్పుడూ, మతిపోయి అరిచేటప్పుడూ కూడ అతని మనస్సుని పట్టి వున్నది చేయి జారిన బహుమతి డబ్బే గాని వేరు కాదు. అందుచేత "రంగనాయకులు చివరి వరకూ పశ్చాత్తాపంతో మథన పడుతూనే వుంటాడు" అని చెప్పిన వాక్యాన్ని నవల నిరాకరిస్తుంది.

అయితే – హత్యలు చేసేది సామాన్య పోలీసులు. లాభాలు కొట్టేది అధికారులు. మీ పరిస్థితి ఏమాత్రం తారుమారైనా మీ కుటుంబాలకు తిండి వుండదు. మీ కూతుళ్ళు వ్యభిచార గృహాలను తలచుకోవలసిందే నన్న బోధ చేసి పోలీసులకు 'అప్పీలు' చేస్తున్నాడని శ్రీ చెరబండ రాజుగారనుకొంటే కాదనలేము. ప్రబోధం అయితే వున్నదా రూపంలోనే.

కాని, ఈ ఆలోచనకూ, త్యాగాలతో శత్రువు మనస్సును దారికి తేగలమనే గాంధీజీ ఆలోచనకూ అట్టే తేడా లేదు. అది విప్లవ క్రియ, సిద్ధాంతమూ కాదు.

దానికి బదులు పోలీసుల్ని రిక్రూట్ చేసుకొనే పల్లె యువకులలో విప్లవ చైతన్యం కలిగించాలన్న ఆలోచనా, వారి నుంచి పోలీసుల్నీ, సైన్యాల్నీ రిక్రూట్ చేసుకోవాలన్న ఆందోళనా విప్లవానికి తోడ్పడతాయి. ఒక పోలీసుద్యోగి మారవచ్చు, కాని పోలీసు బలగం? యు. పి. పోలీసు సమ్మె అంటూ శ్రీ రాజు నవలలో రెండుమూడు చోట్ల పేర్కొన్నారు. దాని ప్రభావం ఎంతటిదో, దాని విస్తృతి ఏపాటిదో, వారి కోరికలేమాదిరివో తెలుసుకోవడం మంచిది. అలాచేయకుండా దానిని 1946 నావికులతిరుగుబాటు అంతటిదిగా వూహించుకోవడం సరియైనది కాదు.

మొత్తం మీద శ్రీ చెరబండరాజు వాస్తవ స్ఫూర్తితో ఎత్తుకున్న ఒక మంచి వస్తువును వాస్తవ విరుద్ధమైన ఆలోచనతో గందరగోళ పరిచారని చెప్పక తప్పదు.

"అవంతి"

# సముద్రం కాదు నా హృదయం

ఆసు రాజేంద్ర

అంతులేని ఈ సముద్రానికి
ఆటుపోట్ల అలజడే తప్ప
ఆలోచనా తరంగాలు లేవు
తీరంతో చెలగాటాలే తప్ప
తియ్యని అనుభూతులు లేవు
కెరటాల కేరింతలే తప్ప
కష్టాల గడగండ్లు లేవు
అతి భీకర గర్జనలే తప్ప
ఆవేదనా గీతాలు లేవు
కళ్లలో కాఠిన్య రేఖలే తప్ప
కారుణ్య కాంతులు లేవు
అందుకే
నేను సముద్రాన్ని కాదంటుంది
నా హృదయం.

## ఇన్ కిలాబ్

(భారత, రష్యా విప్లవ వీరుల గాధలు)
రచన : వై. శేఖర్ - ప్రతులకు : జయంతి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ - 2. వెల : రు. 6 - 00.

1917 నవంబర్ 7 న రష్యాలో జార్ చక్రవర్తుల శీతాకాల ప్రాసాదంపై ఎర్ర బావుటా ఎగిరింది. 1947 అగస్టు 15 న ఢిల్లీలో ఎర్ర కోట మీద మన త్రివర్ణ జాతీయ పతాకం పతిష్ఠించ బడింది. ఈ రెండూ, మన శతాబ్దంలోని యుగ ప్రాముఖ్యంగల చరిత్రాత్మక ఘటనలు. మొదటిది, మానవజాతి చరిత్రలో సోషలిస్టు విప్లవాలకు నాంది కాగా, రెండోది సామ్రాజ్యవాద వలస వ్యవస్థ విచ్ఛిత్తికి ప్రారంభ సూచన. ఈ రెండు ఘటనలకు తోవతీసిన ఉద్యమాలూ, ఘటనలూ, వేరు వేరు మార్గాల్లో సాగినప్పటికీ, అవి అసంఖ్యాక పోరాటాల, వాటిని నడిపిన వీరుల త్యాగాల, ఆత్మబలిదానాల పర్యవసానమే. మహోన్నత లక్ష్యాల కోసం తమ ప్రాణాలర్పించిన జ్ఞాత, అజ్ఞాత వీరుల జీవితాలను శ్రీ శేఖర్ ఈ చిన్న పుస్తకంలో పాఠకులకు పరిచయం చేశారు.

మామూలు జీవిత చరిత్రల పద్ధతిలో గాక, ఒక నవల రూపంలో - 1973 లో బెర్లిన్‌లో జరిగిన ప్రపంచ యువజనోత్సవాల సందర్భంలో కలుసుకొన్న ఒక ఉజ్బెక్ యువతికీ (ఆమె తెలుగు నేర్చు కొన్నది), ఒక తెలుగు యువకునికీ మధ్య జరిగిన స్నేహపూర్వకమైన ఉత్తర ప్రత్యుత్తరాల రూపంలో భారత, రష్యా విప్లవ వీరుల కథలు చెప్పటం ద్వారా, రచయిత మన రెండు దేశాల మధ్య మైత్రీ ఆశయానికి దోహదం చేశారు.

చంద్రశేఖర్ ఆజాద్, సూర్యసేన్, అల్లూరి సీతరామరాజు వంటి సుప్రసిద్ధ వీరులతో బాటు, అంతగా ప్రసిద్ధులు కాని పంజాబ్ విప్లవ వీరుడు ప్రభుదయాళ్, అల్లూరి సీతారామ రాజు సహచరుడు భద్రిరాజు, చరిత్ర ప్రసిద్ధమైన కాకోరీ కేసు సందర్భంలో విప్లవకారులను పోలీసుల బారినుంచి కాపాడేందుకు వీరోచితంగా తన ప్రాణాలర్పించిన సంధ్యాదేవి అనే ఒక సంపన్న గృహిణి వంటి వారి సాహస కార్యాలను కూడా రచయిత ఈ పుస్తకంలో వర్ణించారు. ఇదే విధంగా, అటు రష్యాలో పోతెమ్కిన్ యుద్ధ నౌకలో తిరుగుబాటుకు నాయకత్వం వహించిన ఒక సామాన్య సైనికుడు పెత్రొవ్స్కీ, మాస్కో నగరంలో కార్మిక వర్గ విప్లవ కార్యాచరణకు నాయకత్వం వహించిన ఒక సామాన్య కార్మికుడు ఫిలిప్పెంకో, కార్మిక వర్గ ఆశయం న్యాయమైనదని విశ్వాసం కుదిరి విప్లవ పక్షాన చేరిన ఒక భూస్వామి కుటుంబంలోని యువతి ఓల్గా వంటి పలువురు విప్లవ కారులను రచయిత పాఠకులకు పరిచయం చేశారు.

బ్రిటిష్ వారికి హృదయ పరివర్తన కలిగి భారత దేశాన్ని విడిచి పెట్టి పోయారు; అచ్చమైన అహింసా పద్ధతుల ద్వారానే మన దేశానికి స్వతంత్రం సిద్ధించింది అంటూ, సాధికార చరిత్రకారులు తరచు సాగించే ప్రచారాన్ని ఖండించటం రచయిత తన లక్ష్యంగా పెట్టుకొన్నారు. ఇది ఈ రచన అంతటా పూసల్లో దారంలా కనిపిస్తుంది. రచయిత అభిప్రాయం సరయినదే. కాని, నిజమైన ప్రజా ఉద్యమంతో సంబధం లేకుండా, (ఆనాడు అలాంటి ఉద్యమం లేదు, దాన్ని నిర్మించే ప్రయత్నమూ గట్టిగా జరగలేదు) సాగిన వ్యక్తిగత కార్యాచరణలు నిరుపయోగమైన త్యాగా లయాయని గుర్తుంచు కోవాలి. గాంధీజీ నడిపిన ఉద్యమాల్లో లోపాలున్నవని మనం అభిప్రాయపడినా, వాటికి అనేక పరిమితులున్న వని అనుకొన్నా, అంతకు ముందు మన విప్లవ కారులు నిర్వహించ లేకపోయిన పనిని, అంటే ప్రజలను సమీకరించే పనిని అవి చేశాయని అంగీకరించక తప్పదు. ఈ పరిణామ క్రమం యొంతటి పర్యవసానమే యుద్ధానంతర కాలంలో మన దేశంలో వచ్చిన స్వాతంత్రోద్యమ వెల్లువ. క్విట్ ఇండియా ఉద్యమం, ఆర్.ఐ.యన్. తిరుగుబాటు, ఆజాద్ హింద్ ఫౌజ్ వంటివన్నీ ఈ వెల్లువ వ్యక్తీకరణలు.

రచయిత, ఈ చివరి ఘట్టాలను యాదాలాపంగా ప్రస్తావించి వదిలి వేశారు. వీటిలో పాల్గొన్న వీరుల గురించి కూడా కొంత చెబితే బాగుండేదనిపిస్తుంది.

ఏది యేమైనా, త్యాగ ధనులైన విప్లవ

## మంచి కథలు

కుప్పలు కుప్పలుగా వస్తున్న చెత్త సాహిత్యంలో మంచి సాహిత్యం కూడా కొట్టుకుపోతోంది. దాన్ని గుర్తించి వేరు చేసి నిలబెట్టాల్సిన బాధ్యత సాహిత్య అభిమానుల తక్షణ కర్తవ్యం. ఇటీవల నేను చదివిన మంచి కథల్ని గురించి రాస్తున్నాను.

4. 8. 78 'ఆంధ్రజ్యోతి' (వార)లో రామచంద్రమౌళి గారి కథ 'జరిమానా' బావుండింది. ఆకలి - సమస్యలు - దొంగతనాలు - కోర్టు తీర్పులు - జైళ్ళు - విడుదలయ్యాక మళ్ళీ ఆకలి - సమస్యలు ఇలా ఇదొక చక్రం అని అభివర్ణిస్తూ కోర్టు వాతావరణాన్ని సహజంగా చిత్రీకరించిన కథ. యికపోతే జూన్ 'పుస్తక ప్రపంచం'లో, 'బద్దలయిన నిలువుటద్దం' దేవారాజు మహారాజు గారి కథ. ఒక శాస్త్రవేత్త తన జీవితం ధారపోసి అమృతం కనుక్కుంటే మన దేశంలోని ప్రజలు, పార్టీలు, నాయకులు ఏ విధంగా రియాక్టవుతారనే విషయాన్ని ప్రస్ఫుటంగా చూపించబడింది. దేశం ప్రతి అణువులో స్వార్థం యింతగా యింకిపోయిందన్న విషయం బలమైన దృశ్యం ద్వారా ప్రొజెక్ట్ చేసార్రు. ఈ విధంగా ఇది శాస్త్రీయమైన ఆలోచనావిధానంతో సామాజిక ప్రయోజనాన్ని సాధించేందుకు రాయబడ్డ మంచి కథ. రచయిత పేరు జ్ఞాపకం లేదు గాని జూన్ 'సృజనం' లో 'రాజీ' అనే మంచి కథ వుంది.

అన్ని భాషల కథల్ని తెలుగు పాఠకులకు అందించాలన్న సదుద్దేశంతో వెలువడే 'విపుల' మాసపత్రికలో మంచి కథలు రావడం లేదు. లోగడ 'అభ్యుదయ' లో కూడా చాలా మంచి కథలొచ్చాయి. మళయాళం కథ అనుకుంటాను శ్రీమతి అంతర్జనం గారి కథ, జాక్ లండన్ కథ, యిద్దిష్ భాషనుండి అనువదించిన కథ, ఇటీవల ప్రచురించిన పాకిస్తాన్ కథ 'వంకర వేళ్ళు' వగైరా చిన్నవైనా ఎంతో మంచి కథలు. ఇట్లాగే వెదుకుతూ వుంటే ఎన్నెన్నో దొరుకుతాయి.

యస్. సోమిరెడ్డి మహబూబ్‌నగర్

## సెప్టెంబరు సంచిక

'అభ్యుదయ' సెప్టెంబరు 78 సంచిక గూర్చి ప్రత్యేకంగా చెప్పుకోవలసి వున్నది. మయకొవిస్కీ గూర్చి శ్రీ సోమసుందర్ గారి వ్యాసం సంక్షిప్తంగా, ఆలోచనాత్మకంగా వుంది. మయకొవిస్కీ రెండుమూడు కవితా వాక్యాలనే మన్నుకు ఎత్తుకొని ఆ కవి వాడిన ప్రతీకలను సోదాహరణంగా వివరించడం ఎంతో బాగున్నది. చిన్న వ్యాసాలు కూడా మనలో ఎన్నో విజ్ఞాన ద్వారాలను తెరుస్తాయని సోమసుందర్ గారి వ్యాసం నిరూపించింది. మాదిరాజు కవిత పై శ్రీ శివలెంక ప్రకాశరావు గారి వ్యాసం సమగ్రంగానే వున్నది. కాని వ్యాసకర్త కవితా పరిశీలన ఒకే అంచునుండి చేశారు. విశ్వమానవతను ప్రవచించే మాదిరాజు కవిత మరీ ప్రతీకాత్మకం. సంస్కృత సమాస భూయిష్ఠం. ఎంతో ఎదిగిన సాహితీ వేత్తలకు మాత్రమే ఆయన కవిత ఆస్వాద యోగ్యం. కవితానుశీలనం చేసేటప్పుడు కవి ఉపయోగించిన భాష గూర్చి కూడా కొంత వివరించడం అవసరం. శ్రీ వీటుకూరి ప్రసాద్ నాయని పై వ్రాసిన వ్యాసం బాగుంది. చల్లా రాధాకృష్ణ శర్మ, నరసింహారెడ్డి కవితలు సంచికను వెలిగించాయి.

తిరునగరి ఆలేరు

## రచయితలకు ముడి సరుకు

నిజామాబాద్ గ్రామంలో 105 ఎకరాల బంజరు దానిలో 60 ఎకారాలు గ్రామ హరిజనులకు పట్టా వున్నా 10 ఏళ్లలో పట్వారీ ఆక్రమించుకొని అనుభవిస్తున్నాడు. మిగిలినది తన కొడుకు పేరా, తమ్ముని పేరా పట్టా పుట్టించి ఆక్రమించుకోడంతో గ్రామ రైతులు ఎదురు తిరిగేరు. వారి వత్తాసుతో హరిజనులు గ్రామభూముల్ని ఆక్రమించుకొని జూలై 3 న దున్నుకోడం ప్రారంభించేరు.

ఒక పాఠకుడు మద్రాసు

**బహుమతి కథల చర్చ**
**అక్టోబరు 1 (ఆదివారం)**
**పొట్టి శ్రీరాములు మందిరంలో**
**సాయంత్రం 6 గంటలకు**
**అందరికీ స్వాగతం**

రాయల గురించి ఈ కథనం, స్వాతంత్ర్య పోరాటం, భారత స్వాతంత్ర్యం — వీటి పూర్వ రంగాన్ని మన యువతరానికి పరిచయం చేస్తుంది. భారత – సోవియట్ స్నేహ ఆశయాని .దోహ దంచేస్తుంది. (తు. ల.)

## లేఖలు

### 'మనసును మలినంచేసే మన సినీమాలు'

'మనసును మలినం చేసే మన సినీమాలు' అన్న శీర్షికతో 'అభ్యుదయ' లో (సెప్టెంబరు సంచిక) వెలువడిన వ్యాసం నూటికి నూరుపాళ్లు నిజం. 'రామ కృష్ణులు' చూసి మీకీ లేఖ రాస్తు న్నాను. అయితే దీనికి భిన్నమైన తరహా సినీ మాలున్నాయి. అవి అసభ్యతను చిత్రించవు కాని, కేవలం పేదరాసి పెద్దమ్మ కథల వంటి కాల క్షేపం సరకు. జీవితం, దాని సమస్యల జోలికవి పోవు. అసభ్య చిత్రాల్లా అవి 'మనసును మలి నం' చెయ్యక పోవచ్చును కాని, దానిని పని చెయ్యనివ్వకుండ జోకొట్టి నిద్రపోయేటట్లు చేస్తాయి. మొదటి రకం వాటి కంటె రెండో రకానివి కొంత నయం కదా.

కె. వి. జి. స్వామి — తెనాలి

* * *

'రామకృష్ణులు' గురించి ఒక ప్రేక్షకుడు వ్రాసిన సినిమా సమీక్ష నీళ్ళు నములుతూ వ్రాసినట్లుగా కనిపించింది. దీని నిర్మాతలు జగ పతి పిక్చర్స్ వారు ఆర్థిక విజయం సాధించా రేమో గాని, ఆ విజయాన్ని తమకు చేకూర్చిన ప్రజలకు సబబు సందర్భంలేని కథతోనూ, అసభ్య దృశ్యాలతోనూ యీ చిత్రాన్ని చూపి, కీడు చేశారని చెప్తే అతిశయోక్తి కానేరదు. దశాబ్దాలుగా అగ్రతారలుగా వుంటూ, ప్రజలచే కోటీశ్వరులు లోనరింపబడిన యీ చిత్రంలోని కథానాయకులైన ఎన్. టి. రామారావు, నాగే శ్వరరావు గార్లు, తామార్జించిన సంపదలతో సంతృప్తిపడి, యిటువంటి చిత్రంలో నటించు టకు నిరాకరించి వుండవలసింది. తమకు 'కళా ప్రపూర్ణ' బిరుదమును ప్రసాదించిన ఆంధ్రా యూనివెర్సిటీ వారు, తమ కళాప్రపూర్ణులు యిటువంటి కళావిహీన చిత్రంలో నటించడం హర్షింతురా?

వై. సీతారామ శర్మ — విశాఖపట్టణం

### చక్రబంధంలో సినిమా

ఇటీవలి తెలుగు సినిమాలగురించి మీరు ప్రచురించిన విమర్శలు చదివి సంతోషిం చాను. తెలుగు సినిమారంగం యిప్పుడున్న పరి స్థితిలో మంచి సినిమాలు రావడం యించుమించు దుస్సాధ్యం. పెట్టుబడి దారుల పట్టు అంత గట్టిగా వుంది. పొరపాటున వచ్చినా గుత్త సినిమా వ్యాపారులు వాటిని చూడ నివ్వరు. అవి బతికి బయట పడడం అసాధ్యం. సినిమా పరిశ్రమ ప్రొడ్యూసర్ల, డిస్ట్రిబ్యూటర్ల, అగ్రనటుల చక్ర బంధంలో ఊపిరాడక గిలగిలా కొట్టు కొంటూ వుంది.

ఈ పెద్దలు హీనస్థితికి దిగజారి వున్న యీ కళను శక్తివంచన లేకుండా వృద్ధి చేయడానికి కృషిచేయక పోవడమే కాక, తప్పంతా అటు వంటి సినిమాలు చూసే వారిదే అని చెప్తూ; పి పాపాన్ని ప్రేక్షకుల మీదికి నెట్టి తమ నిర్దోషి త్వం నిరూపించు కోడానికి ప్రయత్నిస్తున్నారు.

వి. వి. రంగారావు — విజయవాడ

---

**నవలలో చిత్రించిన ఘటనలు ఆ మాదిరిగా జరగలేదన్నంత వరకే అవి కల్పితాలు, అసత్యం. కాని నవల విజయవంతం అయిందంటే ఆ ఘటనలు జరగడం తటస్థపడితే నవలా రచయిత చిత్రించిన విధంగానే జరుగుతాయనే. మనుష్యుని స్వభావం గురించీ, తోడివారితో ఆతనికిగల సంబంధాల స్వభావం గురించీ మనకి వున్న పరిజ్ఞానాన్ని అది వ్యక్త పరుస్తుంది. నవలా రచయిత పెట్టు కొన్న లక్ష్యం గొప్పదైనా, కొద్దిదైనా, అతడు ఉదాత్త భావ ప్రకటనను వుద్దేశించినా, పాఠకులకు ఉల్లాసం కోసమే ఉద్దేశించినా అది అంతే. (వాల్టర్ అల్లెన్)**

